శ్రీనివాసరావు, కోలాచలం, 1854-1919

కుశలవనాటకము

చెన్నపురి, 1920

Record no. 143

Śrīnivāsarāvu, Kōlācalaṃ, 1854-1919

Kuśalavanāṭakamu

Cennapuri, 1920

Record no. 143

Bibliographic Record Target

శ్రీనివాసరావు, కోలాచలం, 1854-1919
కుశలవనాటకము / కోలాచలం శ్రీనివాసరావుచే రచియింపబడినది. - 1. కూర్పు. - చెన్నపురి : కలారత్నాకర ముద్రాక్షరశాల, 1920.
6, 129, 14, (1) p. ;19 cm.
Record no. 143

Śrīnivāsarāvu, Kōlācalaṃ, 1854-1919
Kuśalavanāṭakamu / Kōlācalaṃ Śrīnivāsarāvucē raciyimpabaḍinadi. - 1. kūrpu. - Cennapuri : Kalāratnākara Mudrākṣaraśāla, 1920.
6, 129, 14, (1) p. ;19 cm.
Record no. 143

శ్రీ

# కుశలవ నాటకము.

ఇది

బళ్లారిలో వక్కీలుగానుండిన

కీ. శే. కోలాచలం శ్రీనివాసరావుచే

రచియింపఁబడినది.

కో. శత్రుఘ్నరావుచే

ప్రకటింపఁబడియె.

మొదటి కూర్పు.



చెన్నపురి

కళారత్నాకర ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1920



1—4—0.

# ఉపోద్ఘాతము.

ఈనాటకము నావలన నొనర్పంబడి దాదాపుగఁ బదియేండ్లయ్యెను. సుమనోరమ సభవారు పలుమారులు దీనినిఁ బ్రదర్శించిరి. వ్రాఁత ప్రతి, పలువుర కేలంజిక్కి ప్రాఁతగిల్లెను. కథా సందర్భమేమి, గద్య పద్యములేమి, యనేకులకు ముఖస్థములయ్యెను. ఇందులోని యితివృత్త చిత్రము నొకరిద్దఱు గ్రహించి, తమకల్పనాశక్తి వలనఁ గలుగఁబడినవని వ్రాసికొనినారు. యశఃకాములగు వారు లటు పలికికొనుట సహజమేను. దానికి నేఁ జింతింపనుగాని "బాణుడి" నినభంగిఁ జోరకవులను నామమందు దురేయుని మాత్రము చింతించెద.

ఈనాటకములోని యితివృత్తము కొంతవఱకుఁ బట్టాభిరామాయణములోని కథ ననుసరించినది. మూఁడు నాల్గు సీసపద్యముల శైలి యొకటియగాక యాపద్యములలోని గొన్నిపదములు సైత మందుండియే గ్రహింపఁ బడినవి.

ఇటీవలన నాకుఁ గలిగిన దేహ ధననష్టములంబట్టి కలఁతలలోఁ జిక్కి యీనాటకమును ముద్రింపించి ప్రకటింపక మానియుంటిని. ఈనాటకమును నిటీవల రచించిన మహానుభావులు కొందఱు తామే యీనాటకమును బ్రారంభమున రచించినవారమని వ్రాసికొనుటఁ జూచి నామిత్రులు కొంద ఱెట్లులైనను దీనిని ముద్రింపుఁడని పలుమారులు నన్ను బలవంత పెట్టినందున నప్పనికిం బూని కొంటిని. ఇంత కంటెను హెచ్చువ్రాయుట యనవశ్యకము.

ఇట్లు విన్నవించు,
సుధీజన విధేయుఁడు,
కోలాచలం - శ్రీనివాసరావు.

10—6—1919.

మాతండ్రిగారగు కోలాచలం-శ్రీనివాసరావుగారు తమవలనఁ జేయఁబడిన నాటకములన్నియు ముద్రింపించుటకు 1919 సం॥ జూన్ 23 తేది చెన్నపురికి పోవలెనని నిశ్చయించుకొని యుండిరి. ఇట్లుండ జూన్ 19 తేది మొదలు రాజవ్రణ పీడితులై 1919 సం॥ జూన్ 28 తేది నాఁడే యస్తమించిరి. దీనియందు దేమయినను తప్పు లుండిన యెడల అవి మాయజాగ్రత్త వలని తప్పులేకాని గ్రంధ కర్తవి కావు.

ఇట్లు విన్నవించు,

సుధీజన విధేయుఁడు,

కోలాచలం - శత్రుఘ్నరావు.



## శ్రీనివాససుకవి జీవితచరిత్ర.

ఎవ్వాని వదనరా జీవరంగస్థలంబున నలువరాణి నిచ్చలును నట్టువలు సలుపుచుండునో! ఎవ్వాఁడు కువ్యాఖ్యావిషమూర్ఛితయగు కాళిదాస కవితాసుకన్యకను దనను సంజీవినిచేఁ దెప్పిఱిల్లఁజేసి బిజ్జల మిన్నయని వన్నెకెక్కెనో! ఏమహామహు దివ్యనామామృతమును వీనులారఁ గ్రోలని యఖిలాస్యఁ డొక్కఁడైన నీభువిని గానంబడఁడో! ఏమహితచారిత్రుని యశఃకుసుమంబుల ధరియించి దివాకర నిశాకరులు పుష్పవంతులను సార్థకనామమును బడసిరో!

ఏవిద్వద్వత [illegible] సామాన్యమగు మహామహోపాధ్యాయ బిరుద [illegible] య్యెనో! అట్టి చతుష్షష్టి సకల శాస్త్రజలధియగు [illegible] సూరి వంశమున నునశ్రీనివాస కవి ముక్తామణి వి[illegible] సమీపమునునుండు కోనులాపురమను గ్రామ[illegible] 1854-3-18 తేదీలకు సరియగు ప్రమాదీచ సంవ[illegible] దర్శినాఁ డుద్భవించె. ఇతఁడు బాల్యముననే సం[illegible]గ నభ్యసించి, పిదప నాంగ్లేయ భాషయందు దనమ[illegible]డించి, కొంతకాలము రాజకీయోద్యోగిగనుం[illegible]వాదిపరీక్షలయం దుత్తీర్ణుఁడై, బళ్లారిపురవరము[illegible]లుచుండె. ఇతనికి నొకకూఁతురును, నలుగురు [illegible]. మఱియు నితఁడు 1917 సం॥ ఏప్రెల్ 7 తేది [illegible]గిన విద్వత్సభ యని ప్రసిద్ధిఁ గాంచిన యాంధ్ర[illegible] కగ్రాసనాధిపుఁడుగ నియమింపఁబడియుండె. ఇట్[illegible]ఁడు రాజవ్రణపీడితుఁడై యాంధ్ర కువలయంబు [illegible]కంబు లుల్లసిల్ల 1919 సం॥ జూన్ 23 తేది యస్తక[illegible]

ఇట్లు విన్నవించు,

సుధీజన విధేయుఁడు,

[illegible]వాసి - వెంకటరామశాస్త్రి,

[illegible]డుఁడు, మునిసిపల్ హైస్కూలు, బళ్లారి.

## పురుష పాత్రధారులు.

1. శ్రీరాములు.
2. లక్ష్మణుఁడు.
3. భరతుఁడు.
4. శత్రుఘ్నుఁడు.
5. లవుఁడు.
6. కుశుఁడు.
7. వసిష్ఠుఁడు.
8. విశ్వామిత్రుఁడు
9. అష్టదిక్పాలకులు.
10. సప్తఋషులు.
11. హనుమంతుఁడు.
12. జాంబవంతుడు.
13. అంగదుఁడు.
14. సుగ్రీవుఁడు.
15. వాల్మీకి ఋషి.
16. నారదముని.
17. వాసుదేవ ఋషి.
18. నారాయణ దీక్షితులు.
19. యజ్ఞసోమయాజి.
20. పురజనులు.
21. చాకల రంగఁడు.
22. బోయ భీమయ్య.
23. మారప్ప.
24. నరస.
25. ఓబుళేసు
26. చాకలమల్ల.
27. (భద్రుఁడు) గూఢచారి.
28. శిష్యులు.
29. భటుఁడు.
30. శూరసేనుఁడు.
31. లావణి పాటలవారు.

## స్త్రీ పాత్రలు.

1. సీత.
2. మంథర
3. శూర్పణఖ.
4. ముత్తైదువులు.
5. ఓబి.
6. దుర్గి.
7. మారెమ్మ.

# కుశలవ నాటకము.

## నాంది.

### నటీ—సూత్రధారులు.

ఉ॥ శ్రీసతిరాజిలజ్ఞ గుళలకీతిఁ గ్రతుప్రతదక్షు దీక్షచే
వాసిగ లక్ష్మణాద్యనుజవర్గమునేను సపర్యలందుచున్
భాసిల వాయునందనుఁడు భాసురభక్తిని నిల్చికొల్వఁగా
భాసుర సీత మీకు నిడు భూరిగ సౌఖ్య చిరాయు రర్థముల్॥

### అనుబంధము 1.

(నలుదిక్కులఁజూచి) ఏమి యిది? ఎంత నిరీక్షించినను నటి రాక తడసినది. అలంకార మింకను ముగియలేదు కాఁబోలు. తనసింగారమును జూడఁ దోడిచేడియ లెవరును రానందున వారికింగాను కాచియుండునా? ఎది యెటు పోవనీ, యెవరికెంతటి యపకీర్తి రానీ, ప్రపంచము మునుఁగునంతటి కాలము రానీ, తమ వేషమునకుఁ దగిన భూషలు దొరకునంతవఱకును, తమ చేడియలు మెచ్చునంతవఱకును వెలికి వెళ్లదు గదా.

పద్యము॥ ఎడమచేత నద్ద మిడుకొని ముఖ మిటు
నటును ద్రిప్పి కొప్పు నమరఁ గాంచి
కొప్పువిప్పి మరలఁ గొమరొప్పఁ గట్టుదు
రలసయాన లెందు నలసమతులు॥

కావుననే యంబుజాననలు "అలసమతులు-అలసగమనలు" అని లోకు లాడుదురు. కట్టుకొన్నాను గనుక తప్పించుకొనుటకు విధిలేక యున్నది. ఇంత యాలసించినందుకు సభాసదు లేమి యనుకొందురో యనుభీతి దానిమనమం దించుకైనను జనింపదు కదా! అదియేమి

మాయమ్మో నటి సరసలేనపుడు దానిపై నాకెంతటి కోపము వచ్చి దేహముమండినను, సరసఁజేరి "ఏమినాథా" యనినతోడనే శరీర మంతయుఁ జల్లనై కృపారసము వర్షించుచుండును.

నటి.—(లోనుండి గానము సేయుచుఁ బ్రవేశించును.)

సూత్ర.—చూచితిరా దానిశబ్దము వినిన క్షణముననే నా కోపమెల్లఁ బటాపంచలాయెను. శరీరతాపము చల్లారెను.

నటి.—(ప్రవేశించి) ఏమి నాథా!

సూత్ర.—(స్వగ) ఇంచుక బిగిసికొని యుండెద.

నటి.—ఏమి నాథా! పలుకవు.

సూత్ర.—(మొగము ప్రక్కకుఁద్రిప్పికొనును.)

నటి.—నాథా! మీ రిపు డించుక కోపపడియున్నలాగగపడెదు. నే నిపు డింటికిఁబోయి పిలిచినపుడు వచ్చెద. (నిష్క్రమించుచుండును.)

సూత్ర.—(స్వగ) ఇఁక నూరకున్నఁ గొంప మునుఁగును. అవమతి యగును. (నటిని సమీపించి) ప్రియా! ఏమి యటుల వెళ్లెదవు. ఏమో రెయొక యాలోచనలో మునిఁగి నీవు వచ్చినది చూడలేదు. అంతటికే కోపము వచ్చెనా?

నటి.—కోపము లేదు గీపము లేదు. మీ రాలోచన సేయుచుంటిరి కావున మీకు నావలన తొందరకలుగరా దని వెళ్లుచుంటిని.

సూత్ర.—(స్వగ) ఔరా! దీనినేర్పు. (ప్రకాశముగ.) నటీ! మనమీ దినంబున నొక రూపకముఁ బ్రదర్శింపఁజేయుదుమని జనులకుఁ దెలిపి యుంటిమి కదా!

నటి.—కావుననే నే నిచటికి వచ్చితిని. ఏనాటకమాడ నిర్ధారించినారు?

సూత్ర.—నే నాలోచించుచుండిన విషయం బదియేను.



నటి.—కానిండు. మీ రాలోచించుచు నీరాత్రియంతయుఁ గడపుడి. కూడినజనులు మీరుసేయు నాలోచనాభినయముఁ జూచుచుఁ గూర్చుండి యుందురు. నేఁబోయి చల్లఁగ నిద్రసేయుచుందు.

సూత్ర.—అటుకాదు సఖి! మనమిరువుర మాలోచింపఁదగిన విషయమిది.

నటి.—నేను చెప్పినంత పనిసేయు దానను. అధికప్రసంగము నాకేల? స్త్రీలు తెలివిమాలినవారని కదా వారికిఁ బురుషులు చదువునేర్పరు. ఏవిషయమునే గాని వారితో నాలోచింపరు.

సూత్ర.—నటీ! నీవు పొరపడుచున్నావు. అతిబుద్ధికలవా రతివలు కావుననే పురుషులు వారికిఁ జదువుపయోగింపదని వదలినారు. కానిమ్ము. నేడు నూతనముగ రచింపఁబడిన కుశలవనాటక మాడుదమా?

నటి.—కుశలవ నాటకమా? ఎవరిచే రచియింపఁబడినది యది?

సూత్ర.—ఓసీ బుద్ధిబాహ్యరాలా! అప్పుడే మఱచితివియా? తెలిపెదను. విను.

పద్యము॥ మహిత కోలాచలాన్వయ మల్లినాథ
సూరి వంశోద్భవుండయి భూరికీర్తి
వరుఁడుగానుండు శ్రీ శ్రీనివాస సుకవి
చే నీనాటకంబును వాసిమీఱ॥

నటి.—ఏమీ? ఆకవి యిప్పటికాలపుఁ జరిత్రనాటకములు గదా వ్రాయుచుండెను. అతఁడును పౌరాణికగాథలకు దిగెనా?

సూత్ర.—ఏమిసేయును. ఆంగ్లేయభాషా ప్రావీణ్యము లేనివారికెల్లరకుఁ జరిత్రనాటకము లనినఁ దలనొప్పిగనుండును.

నటి.—నిజము-నిజము. చరిత్రాంశములు తెలియనివా రేమిసేయఁ గలరు? నాథా! నే నిపుడు మీ కేవిధమునఁ దోడ్పడఁ గలను?

సూత్రి.—ప్రియా! ఈవసంతఋతువునుగూర్చి యొకపాటపాడి సభాసదుల కాహ్లాదంబుఁ గలిగింపుము.

నటి.—తమ వశవర్తినినేను. అటు లొనరించెద.

అనుబంధము 2.

సూత్రి.—నాతీ! నీ గాన మాహ్లాదకర మనుటకు సందేహము లేదు. మన మిఁక నాటకముఁ బ్రారంభింతము.

నటి.—(చెవులొగ్గి విని) అవియేను. ఉత్సవావార్తములగు కలకలధ్వనులు వినఁబడుచున్నవి.

సూత్రి.—నాతీ! శ్రీరాము లరణ్యవాసం బొనర్చి, దైత్యకులనాశనంబు సలిపి, సీతాలక్ష్మణ హనుమత్సమేతులై పురముఁ బ్రవేశించుచున్నారు. మన భరతరాజు రాముల రాజ్యము రాములకప్పగింప యత్నించుచున్న వాఁడు.

నటి.—అటులయిన సంతోషసమయ మిది. అయినను నామన మేలొకో చలించుచున్నది.

సూత్రి.—నాతీ! ఏమి కారణము?

నటి.—ఆసుఖకంటకురాలు మంథర, ప్రాణముతో నింకను బ్రదికియున్నది కదా? రాములవారి సుఖమునకు మరల భంగముఁ గలిగించునో యని భీతిల్లుచున్నాను.

సూత్రి.—నాతీ! దానిమాట వినువా రెవ్వరున్నవారు? మన కైక వినదుకదా?

నటి.—ఎవరేల వినవలెను. మంథరమాయలఁ దెలియువా రెవరు?

సూత్రి.—ఆభీతి నీకు వలదు. శ్రీరామోత్సవముఁ గన్నులారఁ జూచి యానందింతము రమ్ము. (నిష్క్రమము.)

# ప్రథమాఙ్కము.

ప్రథమరంగము.

వీథి.

నారాయణదీక్షితులు, యజ్ఞసోమయాజులు, మంథర, లావణిపాటలవారు.

నారా.—(యజ్ఞసోమయాజులఁజూచి) ఏమోయి సోమయాజీ! అంత దడఁబడఁగఁ బోవుచున్నావు?

సోమ.—కార్య మట్టిదయా! మన వసిష్ఠులవారు వేగమునఁబోయి విశ్వామిత్ర వారిని బిలిచికొనిరమ్మన్నారు.

నారా.—ఏమీ! నీమాట లెన్నఁటికిని నేను నమ్మను. వసిష్ఠులవా రేమి విశ్వామిత్రులను బిలిపించుట యేమి? వారిరువురకు నిప్పునకు నుప్పునకుఁగల మైత్రిగదా!

సోమ.—నిజము. వా రుభయులకు నెంత ద్వేష ముండినను, శ్రీరాముల వారి కార్యముగావున నత్యంతమైత్రిని వర్తించుచున్నవారు.

నారా.—ఏమీ! శ్రీరాములవా రయోధ్య ప్రవేశించినారా?

సోమ.—ఏమి ఛాందసమయా యిది. రేపటిదినమే వారిపట్టాభిషేకమయా? కావున నీపట్టణమంతయు నలంకరింపఁబడినది. వివిధ దేశములనుండి రాజాధిరాజులు వేంచేసినారు.

నారా.—అటులైన మనకు మృష్టాన్నభోజనము లభించును గదా!

సోమ.—ఒకదినమే కాదు. నెలదినములవఱకు బ్రాహ్మణసంతర్పణ జరుగవలెననియును, బ్రాహ్మణుల కామితార్థంబుల కేకొఱంతయును గలుగనీయక సమకూర్పవలెననియును, శ్రీరాములవారి యాజ్ఞ.

నారా.—అటులయిన ముదమందితి. ఇఁక నాదారిద్ర్యమునకు దారిద్ర్యము కలిగించెద. అయ్యా! మఱచితి. మున్నువలె నామాయాబి మంథర రాములపట్టాభిషేకమునకు నేభంగము కలిగించునో గదా!

సోమ.—ఇపు డది కోఱలుతీసినపామువలె పడియున్నది.

నారా.—సంతోషము. సంతోషము. నాభార్యాబిడ్డలకు సొమ్ము లిప్పటినుండియే చేయించెద.

లావణిపాటలవారు:—

రాములచరితము రాణవినిచెదను రండీజనులారా!
ప్రేమనీకథను వినినవారికిఁ బెంపగు భాగ్యములు
అర్కవంశకులమున వైవస్వతుఁడనునట్టి మనువుపుట్టె
నార్యులెల్లరు సన్నుతింపఁగను నార్జించెను కీర్తి
కీర్తిపరుండిక్ష్వాకుఁడు పుట్టెను కీర్తింపఁగ జనులు
ఆ కీర్తిహారుండయి కుక్షియనెడురా జతనికి జనియించె
అతనికిఁ గకుత్స్థుఁ డుదయించెనుబలు, వితరణ ఖనియగుచు
అతిబలయుతుఁడయిన కువలయాశ్వుం డతనికి జనియించె
ఆకులమున మాంధాతపుట్టుచు నార్జించెను యశము.
భీకరబలుఁడయి త్రిశంకుఁడతనికిఁ బ్రీతిసుతుం డయ్యె
నిత్యకీర్తినిలనార్జించిన బలునీతిపరుఁడు రాజు
సత్యహరిశ్చంద్రుండనుసుతుండు స్తుత్యుఁడగుచుఁబుట్టె
సగరుండనురా జతనికులమున సంభవించె భువిని
అగణితపుణ్యుండాత్మవిదుఁడు సర్వారాధ్య యశుండు
అతనివంశమున దశరథుఁడనురా జవనిని జనియించె
స్తుతమతియయి మనరాములతనికి సుతుఁడై జనియించె
జనకజయగు మనజానమ్మను జాయగఁ దానేలె
జననికిముద్దులకొడుకయిమించెను జనులకు ముచ్చటగ



మాయలమంథరమాటవినిన తన మాఱుఁదల్లియాజ్ఞ
ఆయతాటవికి నరిగె దారతో నచ్చెరువుగ రహిని
ముదితహృదయుఁడై యహల్యశాపవిమోచనమొనరించె
పదరజమునసోఁకించితాతిని ముదితగనొనరించె
కుటిలరావణుండటవిని సీతను గొనిపోయిన తఱిని
పటుతరవిక్రమశాలియగుచుఁ దాఁబంక్తికంఠుఁగూల్చె
రాముని మనరఘురామునికీర్తిని రహివర్ణింపఁగను
కాముని వైరికి నైననువశమే కాంచుఁడి జనులారా!
రాముఁడెనిత్యము రాముఁడెసత్యము రాముఁడెదైవమ్ము
రాముఁడెసౌఖ్యము రాముఁడెసర్వము రాముఁడెమోక్షమ్ము
రామునిచరితము వినినజనులిల నిరామయులై యుంద్రు
రామునికథలను వినినవారికి రాదిలఁ బుణ్యమ్ము
రఘురాములపట్టాభిషేకము రాణఁగఁ గనుఁడయ్యా
యఘవిమోచనం బార్యసమ్మతం బందఱు రండయ్యా.

(మఱికొందఱు రామభజనచేయుచు, రామకీర్తనలు పాడుదురు).

మంథర.—ఏమీ! నా పగవానిని రాముని నింతగ జనులు నుతించుచున్నవారు. ఆస్తుతులు నేవినవోప. చిన్ననాఁడువాఁడు తన కాలితోఁ దన్నిన నానొప్పి యింకను మానకయున్నది. అలనాఁడు యువరాజపట్టాభిషిక్తునిఁజేయ దశరథుఁడు దలపెట్టినపుడు నారాణియగు కైకకు బోధించి రామునిపట్టభంగమొనర్చితి. రేపు రాజపట్టాభిషేకంబు రామునకగునఁట. ఇది యెటులు భంగపఱుపఁగలను? ఇక్కార్యమునకు నాకెవరు తోడ్పడుదురు? రామునిపై నెద్దియైన నిపుడు కైకకుఁజెప్పినచో నది నన్నే యింటినుండి తఱిమివేయును. అన్యసాహాయ్యాపేక్షసేయకయే యిప్పని నేనొనరింపవలయును. పట్టభంగంబు సలుపలేకున్నను రామునకు సుఖభంగంబైనను సలుప యత్నించెద. వానిసంతోషము నాకు దుఃఖము. రాముఁడేవిషయమున ముదమందునో దానినిఁగనిపెట్టి యావిషయమునుండి వానినెడఁబాపెద. ఇదియ నాసంకల్పము. నన్నెవరును నమ్మరు. పల్కరింపరు.

రమ్మనరు పొమ్మనరు. కైకసైతము చక్కఁగ మాటలాడదు. దుష్టురా లని నన్నందఱు దూషించుచున్నవారు. వచ్చిన చెడ్డపేరు చచ్చువఱకు పోదు. చెడ్డది మంథరయని ప్రపంచంబునఁ బ్రసిద్ధి కెక్కెద. నానేర్చిన మాయ లన్నియు నీరాముని సుఖభంగంబునకై ప్రయోగించెద.

సీ॥ రాముని జూచినంతటనె రాఁజును వహ్నిమనంబులోన, నా
రాముని మాట వీనులకు రంపముఁ బోలుచుఁ గోయుచుండు, శ్రీ
రామునిస్తోత్రపాఠములు ఖాపిడియై నుదినొప్పఁ జేయు, నా
రాముని గీటడంపకయె, రాదు సుఖం బిల నాకు నెన్నఁడున్॥

ఇపుడే నేఁబోయి పట్టభంగంబునకు యత్నించెద. అది సాధ్యపడదేని నాఁగవాసి సుఖభంగంబునకు నాయావచ్ఛక్తి వినియోగించెద. నా యత్నము లెవ్వియు వెలిపడనీక జాగరూకతగనుండవలయును. ఎవఁడో వానరుఁడు కనులెఱ్ఱఁజేసికొని గుడ్లుఱుముచు నాదిక్కునసే చూచుచుండును. వానికి వెఱచినటులు మఱియెవనికి నే వెఱవను. వానిఁజూచినతోడనె నా శస్త్రాస్త్రము లుడిగిపోవును. అయినను నా యత్నము నే వదలను.

అనుబంధము 3.

నా యిష్టార్థంబు నెఱవేఱుసంతవఱకు నే నొక యరణ్యంబుఁ జేరెద. ఇచట నుండఁ జాలను. (నిష్క్రమము.)

---

## ద్వితీయ రంగము.

### శ్రీరాముల పట్టాభిషేకము.

అష్టదిక్పాలకులు, సప్తఋషులు, సుగ్రీవ జాంబవంత హనుమాదులు,
భరతలక్ష్మణ శత్రుఘ్నులు, కైక సుమిత్ర కౌసల్యాదులు,
సీత, ముత్తైదువలు, బ్రాహ్మణులు.

అనుబంధము 4.



(శ్రీరాములు సీతాసమేతులై సింహాసనముపైఁ గూర్చుండియుందురు. పాదములక్రింద నాంజనేయుఁడును, ఇరుప్రక్కల విభీషణ సుగ్రీవులు చామరములు వేయుచును, భరతశత్రుఘ్నులు సేవకులై క్రిందనిలిచియునుందురు. లక్ష్మణుఁడు ఛత్రముఁ బట్టికొనియుండును.)

(వసిష్ఠులు లేచి). సభాసదులారా! శ్రీరామపట్టాభిషేక శుభకాల మిది. ఇట్టికాలంబున సూర్యవంశ పురోహితుఁడనగు నేనావంశజుల పూర్వచరిత్రంబు సంక్షేపంబుగఁ దెలుపుట విధ్యుక్తముగ నాపనిగనున్నది. పుణ్యశ్లోకులగు నీవంశజుల మహోదారచరిత ముగ్గడించుటచే వినువారికినఘ వినాశనంబునునా, వదవికివచ్చువానికి వారిబలె యశఃకాముఁడై యుంటకుఁ బ్రోత్సాహమును గలుగును కావున నేనిపుడు వారిచరిత్రంబు సంక్షేపముగఁ దెలిపెద. సావధానముగ వినుఁడు. బ్రహ్మమానసపుత్రుఁడగు మరీచికిఁ గశ్యపమహర్షి పుట్టెను. ఆమహామహుని ప్రభావమునుండికదా యీభూమికిఁ గాశ్యపినామంబు కలిగెను. ఆమహర్షికిఁ దేజోమూర్తి సూర్యుఁ డుద్భవించి మనకెల్లరకుఁ గర్మసాక్షిగనిలిచెను. ఆవివస్వంతునకు వైవస్వతుఁడను మనువు పుట్టి, ప్రపంచంబున ధర్మవిధుల నేర్పఱిచి సుఖముఁ బాలించుచున్నవాఁడు. ఇతని పుత్రుఁడగు నిక్ష్వాకుని పౌత్రుఁడగు కకుత్స్థుఁడు వృషభరూపి యగు నింద్రునిపై నెక్కి యనేకరాక్షసులఁ జంపి పురంజయుఁడను పేరుపొందెను. ఈమహోదారుని వంశజుఁడగు హరిశ్చంద్రుఁడు సత్యమే జయమను నుడి యీధర స్థాపింపఁదన సంపదనెల్ల నీవిశ్వామిత్రులకు దారవోసి తనదారను, సుతునితోసైతము వీథిని విలిచి కాటికావలివాఁడయి తుదకు నింద్రపదవినందెను. ఆసత్యవ్రతు వంశసంభవుఁడగు సగరుఁ డశ్వమేధయాగముకతంబున భూమిం ద్రవ్వి సముద్రమునకు సాగరశబ్దంబు సార్థకపఱిచె. ఆవంశజుఁడు భగీరథుఁడు భూరితపంబొనర్చి దేవతాపగను భూమికి దించి భాగీరథీ శబ్దోత్పత్తిఁ

గోచరుండాయెను. అహహో మహాముని మనుమముగదా మహాశ్చర్యము. అతని పూర్వజన్మ తపఃఫలముగ దైవము కారణముఁగొని శ్రీరాములవతారమున నీధరఁబుట్టి రాక్షసవంశనాశన మొనర్చెను. ఇట్టి మహానుభావుఁడు మిము నేలు రాజుగ నిపుడభిషిక్తుఁ డగుచున్నవాఁడు వంశానుగతవిధి ననుసరించి యీపుణ్యమూర్తికి నేఁడిచట మంగళాద్యభివస్తువు లందించి, పెద్దలాశీర్వదింపవలెను కావున, మహామహాలారా! ఈపుణ్యశ్లోకుని పురోభివృద్ధినిఁగోరి మీరు త్రికరణశుద్ధిగ నాశీర్వదింపవలెను. (అనుచు నక్షత లందఱికి నిచ్చును.)

అత్రి.—ఉ॥ స్వస్తి సమస్తదైత్యకులసాధన యోగ్యకృపాణపాణికిన్,
స్వస్తి-సమస్తదేవగణసాధనయోగ్యసుకర్మశాలికిన్,
స్వస్తి సమస్తభూమిజనసాధనయోగ్యమృదూరువక్త్రకున్,
స్వస్తి ధరాత్మజాపతికిఁ బావనకీర్తికి రామమూర్తికిన్॥

భరద్వాజ.—శా॥ శ్రీరంజిల్లఁగ గాధిజాధ్వరము నిర్విఘ్నంబు గావించి, శ్రీ
గౌరీకాంతు శరాసనంబుఁ బోడిగా ఖండించి, సంప్రీతిచే,
శ్రీరామాపరమాపభూసతిసుతన్ సీతాసతి గ్గొన్న, సు
స్మేరాంకూరముఖారవిందున కగున్ శ్రీమించు సౌభాగ్యముల్॥

విశ్వామిత్ర.—ఉ॥ కారణజన్మ మూని కఱకంఠునివిల్లును ద్రుంచి వేడ్కచే
ధారణికన్యకన్ సతిగ ధారణఁ జేయుచుఁ దండ్రియానతిన్
ఘోరవనాంతరంబులను గ్రుమ్మరి సేతువు కట్టి రావణున్
బోరునఁ గూల్చు రామునకు భూరితరాయువు గల్గుఁగావుతన్॥

గౌతమ.—గీ॥ ఖలకులంబు నెల్ల ఖిలమొనరించుచు,
శిలను లలనఁ జేసి శీఘ్రగతిని
శివునివిల్లును ద్రుంచి సీతను బెండ్లాడి
నట్టి రామమూర్తి కగు శుభంబు॥

కశ్యప.—కం॥ ఖరదూషణాదిదైత్యులఁ
బరిమార్చినసత్త్వశాలి భాస్కరవంశా
భరణమయి వెలుఁగు రాముఁడు
ధర, స్థిరతరభోగభాగ్యతను బెంపొందున్॥



జమదగ్ని.—ఉ॥ అంబును చేతఁబూని నిశితాశుగ మొక్కటి వేసి, సప్తతా
ళంబులఁ జీల్చి, వాలిని నిలన్ బడఁగూల్చి యుదారచిత్తమా
దంబుగ రాజ్యమేలి హరిదశ్వకుమారుని నిల్పినట్టి-దై
వంబగు రామమూర్తి విభవంబులనందుచుఁ గీర్తిఁగాంచుతన్॥

## అష్టదిక్పాలకులు.

ఇంద్ర.—సీ॥ సురరక్షకై భువినరుదారఁ బుట్టిన వాసుదేవునకు నావందనములు,
అగ్ని.— దశరథు ప్రాకృతధర్మఫలంబగు, స్వామికినిడెద సాష్టాంగనతులు.
యమ.— శోకంతురాయిడిఁ దప్పించు శ్రీరామ, మూర్తికి భక్తిని ప్రొక్కులిడెద,
నిరృతి.— క్రూరనక్తంచరవారనాశకుఁడగు, రామునిపదములఁ బ్రణతులిడెదఁ,
వరుణ.— శరమునసబ్ధిని శాసించువిక్రమ, శాలికిభయభక్తిఁ గేలుమోడ్తు,
వాయువు.— పవనునిదాస్యముఁ బొందిన మహానీయ, మూర్తికినయరీతి మోడ్తుఁగరము,
కుబేర.— ధనదుని నిజముపేదతనముఁ బాపినమహా ధీరుపాదముల జోహారు లిడెద,
ఈశాన.—గీ॥ భక్తచింతామణిని నేను భక్తిఁగొలుతు,
సుగ్రీవ.— దీనమందారు నేను ప్రార్థింతు మదిని,
జాంబవం.— నతజనావనునకు నేను నతుల నిడుదు,
అంగద.— శ్రితశరణ్యుని నే సదానుతులఁ గొలుతు.

వసిష్ఠుఁడు.—(కిరీటము దెచ్చి పూజించి, పెద్దలహస్తస్పర్శనము గావించి శ్రీరాములశిరమున నుంచి యక్షతలు తిలకముగ నుంచును. ఇది జరుగునపుడు ఋషులు మంత్రపుష్పము చెప్పుచుందురు. పిదప అమాత్యులు వానరులు నమస్కరింతురు.)

### అనుబంధము ౭.

శ్రీరాములు.—మహానుభావులారా! భాతృవరులారా! అమాత్యవరులారా! మీరిక్కాలంబున నన్నింతగ నుతించునది యచ్చెరువుగ నున్నది. ఈసత్తముల యమోఘాశీర్వాదఫలంబున నాకు వనవాటిని గలిగిన సీతావియోగవ్యసనంబుఁ బాపికొంటిని. ఇదిగా

లకుల దివ్యశిఖమగు దీవనలచే లోకకంటకుండగు రావణునిఁజంపితి. నాసాహసోద్యమమునకీ వానరశ్రేష్ఠుల యసదృశసాహాయ్యంబుఁ దెలుపుట యసాధ్యంబు. అందున నాంజనేయనామ విఖ్యాతుండగు నీమహాపురుషుని సాహాయ్యసంపద నభినుతింప బ్రహ్మకైనను నసాధ్యంబు. నాపూర్వజన్మ సుకృతఫలంబుననో, నాతల్లులదీవనల మహిమనో, నాకొనవిన కష్టములన్నియును సుఖములుగఁ బరిణమించె. మీరు కృపాతిరేకంబున నా కీవుడొసఁగిన రాజపదవి నే ననుభవించుచు ధర్మప్రచారవృత్తిని ధరనేల యత్నించెద. నానుండెద్దియైనను లోపము కలిగెనేని నదియజ్ఞానకృతకార్యఫలంబని మీరెఱింగి నను మన్నింతురని కోరెద. బుద్ధిపూర్వకంబుగ నే నేదోషకార్యంబు నేయరాదని నిశ్చయించినాఁడను. అన్యాయమునకు నేఁజోటీఁబడను. అపనిందలకు నే లోఁబడను. ఏకపత్నీవ్రతుండనై, పరనారీసోదరుఁడనై, పరధనంబు నాశింపక, పక్షపాతంబుఁ బూనకయుంటకు సభాసదులెల్లరు న న్నాశీర్వదింతురని ప్రార్థించెద.

(భరతునిఁ జూచి). భ్రాతృవరా! ఈమహనీయులగు సభాసదులకు నుచితానుభంగి యథాశక్తి న్యాయమున సత్కరింపుము.

(సీతనుఁజూచి). ప్రేయసీ!

కం॥ జనకజ యొవ్వని మహిమను
దనుజాధిపుచెఱను దప్పి తనివొందితివా
వనచరపుంగవున కిడు
మనఘుంబీ రత్నమాల నతి మోదముగన్॥

(అనుచు రత్నమాల సీతకరమున నిడును.)

సీత.—(మాలనంది).

సీ॥ ఏ కపిపుంగవుం డెలమి నాథూపలం, బ్రాణనాథున కిచ్చి ప్రాణముంచె
ఏ వానరశ్రేష్ఠుఁ డిష్టబంధువుఁడయి, సుగ్రీవునకు రాజ్యసుఖము నిచ్చె
ఏ మహాబలశాలి యమ్మహాసింధు, దాఁటెఁ గాల్వనుబోలె త్వరితముగను
ఏ ప్లవంగాధిపుఁ డేచ్చి మీఱఁగ లంకఁ, జొచ్చి నామనమునఁ జొనిపె ముదము॥



గీ॥ ఎవఁడు రావణు నెదిరించి యేర్చె లంక
నెవఁడు నాయున్కి రాముల కెఱుకపఱచె
నట్టి నాసోదరప్రాయుఁ డాంజనేయు
కంఠమున నిద్ది వెలుఁగును గాతఁ గాంతి॥

(అనుచు నాంజనేయుని కంఠమున హారము వేయును).

ఆంజనేయుఁడు.—(హారమునుఁ జూచి).

ఉ॥ రామునినామ మిందుఁ గనరాదుగదా? యిదియేల నాకు; నా
రామునినామ మిందుఁ గనరాదుగదా? త్యజియింతు దీనినిన్;
రామునినామ మిందుఁ గనరాదుగదా? యిది యుజ్జగింతు; నా
రామునినామమున్ గననిశాతిని; రత్న మనంగఁ జెల్లునే॥

(మాట.) రామా! పరంధామా! పాపాంధకారహిమధామా! నాపై నీసంపూర్ణానుగ్రహముచెవఁజల్లి నన్ను ప్రసిద్ధికిఁ దెచ్చుటకై నీవిటుల నన్నుఁ బెద్దఁజేసిపలికితివి. రామా! తరుచరుండనై ఘోరారణ్యంబుల సంచరించుచు వివిధవృక్షఫలము లాహారముగఁ గొనుచు, ఋష్యమూకమునందు నాకు దర్శనం బిచ్చి జ్ఞానోదయంబు గలిగించిన దివ్యమూర్తివి నీవు కావా! విధాతృదత్తవరగర్వంబున సర్వగీర్వాణులను బాధించి రజతాచలమును కేలున నెత్తి బంతిగ నాడిన దశగ్రీవుని తనవాలమునఁ జుట్టికొని సప్తసముద్రములలో ముంచిన వాలినొక వాలంబున నేలం బడవైచిన సత్త్వశాలివి నీవా! నా సామర్థ్యంబుఁ బొగడునది? కేవల పక్షిరూపమెత్తి యొక్కాలమునను దైవనామంబు స్మరించి యెఱుంగని జటాయువునకు నవసానకాలమున దర్శనం బిచ్చి ముక్తిమార్గంబుఁజూపిన పరంధాముఁడగు నీవు, నన్నింతగ నుతించినదిగాంచ, నాకు సిగ్గుగనున్నది. గౌతమశాపతప్తయై రాతిరూపమున నున్న యహల్యను నాతిని చేసినదియు, స్థూలశిరశ్శాపంబున వికృతరూపంబుదాల్చి యరణ్యవాసంబున నిన్ను బాధించిన కబంధునకు స్వస్వరూప మిచ్చినదియు నీదివ్యమహిమములనఁగదా? పరమాత్మా!

సీతాన్వేషణమునకై నేఁజని సముద్రతీరంబుఁ జేరి యపారపారావారము దాఁటు దారిగానక చింతించుచు నీపావన నామధ్యానము చేసిన క్షణముననే నాభుజములకు ఱెక్కలువచ్చి నాకపరిమితోత్సాహంబుఁ గల్పించి యగాధ సముద్రముఁ బిల్లకాల్వఁబలె దాఁటఁజేసినది నీదివ్యానుగ్రహము గదా? అపారాకూపారంబును దరించుతఱి మధ్య సముద్రమున నాకంతరాయముగ నిలిచిన సురస శరీరంబణుమాత్రరూపంబునఁజొచ్చి లోపల బృహద్రూపంబు దాల్చి యా యసురను జీల్చినది, మహానుభావా! నీ మహామహిమవలనఁ గదా? లంకిణినిఁజంపి యగమ్యంబగు లంకఁజొచ్చి దుర్గమంబగు రావణమందిరం బన్వేషించి క్రూరరక్తంచరపాలితంబగు నశోకవన మధ్యమున వికృతాసుర పరివేష్టితయై పరితపించుచుండిన భూజాతను, పరిపూర్ణచేతను, సతీగణప్రఖ్యాతను, విమలగుణవిఖ్యాతను, లోకమాతను, సీతనుఁగని, ధన్యుఁడనైనది నీ నిష్కారణ కరుణాతిరేకంబునఁగాక, వేఱొకటి కలదా? కోఁతికి రత్నహారమా? పావననామా! త్రిలోకాభిరామా! వదనజితసోమా! వైభవజితసుత్రామా! రణాజిజిత భార్గవరామా! అర్యమాన్వయాబ్ధిహిమధామా! రామా! నీపవిత్ర పాదారవిందములు సదా సేవించుచుండు భాగ్యమొకటి నాకుఁ బ్రసాదించినఁ జాలు. అదియే నాకుఁ బదివేలు.

(వృత్తము). పంచచామరము.

దయాపయోనిధీ భవత్పదంబులందు వ్రాలెదన్
పయోజపత్రనేత్ర నిన్ను భక్తినిన్ దలంచెదన్
దయాతిరేకతన్ భరించు దాత నీవు కావునన్
భయంబు వీడి వేఁడికొందు భక్తముఖ్యుఁ జేయుమా॥

(అని నమస్కరించును.)

ముత్తైదువులు.—(మంగళహారతి యెత్తుదురు.)



మంగళమహాశ్రీవృత్తములు.

1. శ్రీ విభవయుక్తుఁడయి-చిత్తభరక్తుఁడయి-సిద్ధజన ముక్తికిని జోడై
దేవగణ సక్తుఁడయి-దీనగుణ రిక్తుఁడయి-తేజరిలు మాధవుఁడు మీకున్
బావనపు జీవనము-పాయని యశోధనము-ప్రాభవము నిచ్చెడు నటంచున్
భావమునఁ గోరుచును-భామినులు భక్తి మెయిఁ-బాడెదము మంగళమహా శ్రీ.

2. కంపనము లేని యనుకంప జనియింపమన-కాపురముల న్దనుచు క్షోణిన్
సంపదల తంపరలు-సంపతిలి యింపలరు-సంబరమున న్దనరి యీ, మా
దంపతులు పెంపుఁగని-తాలిమికిఁ దావులయి - తౌల్య రహితంబుగ రహింపన్
గుంపులుగ భామినులు-గూడికొని దైవమును-గోరుదుము ననారతము భక్తిన్.

(అనుచు పల్లెము మూఁడుమార్లు ద్రిప్పుదురు.)

(మంగళవాద్యములు, సంగీతము మొదలగునవి జరుగుచుండును.)

(నిష్క్రమము.)

---

## తృతీయరంగము.

మంథర, శూర్పణఖ, (విజనప్రదేశము.)

మంథర.—హా! హా! అలనాఁ డాయంగళ్లవీథిని నాపగవాని నామంత్తిఁగని నాకు మితిమీఱి కోపాగ్ని మనమున దంకురించెను. వానిని గురించి జనులనుతులు విని క్షణముననే మంట లెగయసాఁగెను. అయ్యో! పదునాలుగేండ్లు రాము నడవికిఁ బంపి సుఖాంబునిధిలో మునిఁగి తేలుచుంటిని. మరల నాసుఖకంటకుఁడై, నాపాలిటి యేదవగ్రహమై యాపాపి రాముఁడు పట్టణముఁ జేరెను. కటకటా! పట్టాభిషిక్తుఁడై పట్టమహిషింగూడి నిట్టున నీల్గుచున్నవాఁడు. పట్టాభిషేకంబునకు భంగంబుఁ గల్పింపవలెనని నేనెంత యత్నించినను నది ఫలింపదయ్యె. ఏకాంగినైన నాయత్నము సముద్రమున

ముగట్టిన భంగి నిష్ఫల మగుచున్నది. నాపగతుని జాతకలక్షణమే మిదియో, యెవరును వానిపక్ష మవలంబించి నన్ను దూషించుచుండరు. ననుఁబోలు సమర్థురాలు మఱియొకతె నాకు సాహాయ్యకారిణిగ నుండినచో నా రాముని గీముని సుఖమును గాల్పనా? వాని కన్నీటి సముద్రములోనే వాని ముంచి సంతసింపనా? ఏమిసేయుదు? వాఁడుండిన వీడు నాపాలిటి కాడుగ నున్నది. వాఁడుండిన పురి నా కుఱికిగనున్నది. వాని యింటియన్నము నాకు సున్నముగనున్నది. ఇట్టి వానిని నేనిటు గన్నులారఁ గాంచుచుఁ గాలంబుఁ గడుపుదు. ఎటులు వానిని లోఁబఱచికొని విషాన్నమిడి వానినిఁ జంపఁజూచిన నా యత్నము బూడిదలో హోమమాయెను. ఏమిసేయుదు. వాని సుఖంబునకు భంగంబు గలిగించునంతవఱకు నాయిల్లు నేఁజేరను. ఈ వనమే నాకుఁ బట్టణమై యుండును గాత.

కం॥ గనుకను నద్ది భుజించిన
పనఁగా నగపడ దదేమి పాపమొకో-యీ
దనమేర్పడఁగ నదికిని సం
తస మించుకయైనఁ గనను దద్దయుఁ జింతన్॥

కావున వన వాటికలో నే పడియుండి కాల మాసన్నమైన తఱిఁ బ్రాణంబు వదలెద.

శూర్పణఖ.— (ప్రవేశించి) ఏమిది? కాకతాళీయ న్యాయముగ నే నే విషయమును గుఱించి చింతించుచుంటినో యా విషయమును గుఱించియే చింతించుచు నెవ్వతెయో యిట పలవరించుచున్నది. హా! హా! ఆ పాపకర్ముని రామునకై యెంద ఱెంతగఁ గుందుచున్నవారో? పాప మీ కుబ్జకు వాఁ డెంతటి యపకార మొనర్చెనో? ఇల్లు వాకిలి వదలి వనవాటికలోఁబడి పలవరించుచున్నది? అలనాఁడు వాఁడు నా కొనరించిన యపకారంబునకు సాక్షిభూతములై వికలములగు నా ముక్కును, చెవులును నను వదలక నిలిచి



నవి. నేను వాని నేమి గోరితిని? ఏమి యపేక్షించి వాని నేఁ బ్రార్థించితి. నన్ను వ్యర్థమనోరథను జేయుటయ గాక తన తమ్మునకు బోధించి నా ముక్కుఁ జెవులు గోయించెను. నాకులనాశనం బొనరించెను. ఇట్టివాఁడు సుఖసంపదచే విఱ్ఱవీఁగుచుండఁ గనులారఁ జూచి, మనియుండఁగలనా? అణువుమాత్ర శరీర మీఁగ రూపమునఁ బూని యా రాముని వెన్నంటి యెద్దియైన నొక యపాయంబు వానికి సలుప యత్నించినను వాని నెల్లప్పుడా కోఁతి కాచుచుండును. ఆకోఁతినిఁ జూచిన క్షణముననే నా గుండె తల్లడిల్లును. ఆ కుటిల కుంతల కుత్రల మాయావి సీత, వాని నేమి మందు పెట్టెనో యెఱుఁగను. దానినిఁ గనిన క్షణముననే దాని బంటై వాఁడు దానియాజ్ఞకు లోఁబడి యుండును. దానిఁ జూచిన నాకొక్కడలేని సంకటముఁ బుట్టును. ఎటులనయినను దాని నుండి వానిని నెడఁబాపితినేని నాయిష్టార్థంబు సమకూఱును. దానికి మార్గము వెదకవలెను. ఈ భామ, నా కావిషయమునఁ దోడ్పడునేమో విచారించెద. (అనుచు మంథరను సమీపించి)

శూర్పణఖ.—ఏమమ్మా-నీవెవతెవు? ఈవిజనప్రదేశమునం దేల నిలిచితివి.

మంథర.—అమ్మా-నీవెవతవు? ఈ నిర్జనాటవి నేల సంచరించెదవు?

శూర్ప.—అమ్మా-నీవెవతె వని నేనడుగ నది తెలుపక, నన్నేల ప్రశ్నించెదవు?

మంథర.—అమ్మా-నేనొక నిర్భాగ్యురాలను-నావార్త నీకేల. నీవార్త మున్ను దెలుపుము.

శూర్ప.—నేనొక నిర్భాగ్యను - అయినవారినిఁ బోఁగొట్టుకొని కాని వాని వెంటనంటి బాధపడుచున్నాను.

మంథర.—అమ్మా-నేనును నొక నిర్భాగ్యను-కానివాని సుఖానుభవముఁ జూచి కడుపున నుంటపసీ యింట నిలువఁజాలక నిర్జనాటవిఁ బ్రవేశించితి.

శూర్ప.—అమ్మా-నీ పురి యెద్ది-నీ నామ మెద్ది?

మంథర.—అమ్మా-నా పేరు మంథర; నా పురి యయోధ్య. ఇఁక నీ పురి యెద్ది? నీ నామ మెద్ది?

శూర్ప.—(ఆశ్చర్యవంది) -అమ్మా; నా పేరు చుప్పనాక. నా పురి మంటిఁ గలసెను.

మంథర.—ఏమీ! నీ పేరు చుప్పనాకా? శూర్పణఖకుఁ జుప్పనాకయని యందురని వినియుంటిని; ఆ శూర్పణఖ నీవేనా!

శూర్ప.—అవు నమ్మా; ఆ శూర్పణఖ నేనేను.

మంథర.—అవునమ్మా; నీ పేరు నా రాణిగారి సవతికొడుకు తెలుపుచుండ వినియుంటిని;

శూర్ప.—అమ్మా-నీరాణి యెవతె? ఆమె సవతియెవతె? ఆసవతి కొమారుఁ డెవఁడు?

మంథర.—అమ్మా-నా రాణిపేరు కైక-దాని సవతి కౌసల్య-దానికొడుకు పేరు నే నుచ్చరింపను-వాఁ డొక పాపాత్ముఁడు.

శూర్ప.—(నవ్వుచు) పేరుచ్చరించిన మాత్రానఁ దప్పేమి? వాని పేరేమి?

మంథర.—(ఆలోచించుచు పైనఁ జూచును)

శూర్ప.—అమ్మా పేరడిగినంతనే చెట్టుపైనఁ జూచెద వేల?

మంథర.—ఎందులకును గాదు. ఆ క్రూరాత్ముని సరస నొక కోఁతి యున్నది. ఎచటెచట వాని నామ ముచ్చరింతురో యచట యా కోఁతి నిలిచి యుండును.



శూర్ప.—ఆ కోఁతి పేరేమి.

మంథర.—ఆంజనేయుఁ డఁట.

శూర్ప.—(సంచలించుచు) - ఆ పేరు వినిన నాకును భయమయ్యెడు వానిని నేఁ జూచినాను - వాఁడే నా పగవాఁడగు రాముని నచ్చిన బంటు.

మంథర.—ఆ క్రూరాత్ముఁడు రాముఁడు నీ కేటి పగవాఁ డయ్యెను?

శూర్ప.—అది నగుఁబాటుగ నున్నది. ము న్నారాముఁడు కానన వాసంబున నున్నతఱి నేను వానిఁజూచి కామించి పైఁబడితి. అంత తా నేకపత్నీవ్రతుఁడనని బొంకులాడి నన్నుఁదన తమ్ముని సరసకుఁబంపి ముక్కుఁ జెవులును గోయించెను. నాఁటినుండియు వానిపైఁ బగఁబట్టి నేను లంకఁజేరి నాయన్న రావణునకు బోధించి సీతను వాని నుండి యెడఁబాపి వానిని వ్యసనవారధిలోఁ బడఁద్రోసితి.

మంథర.—భలా-భలా - సాహస మాడువారిసొమ్మనునది నీ నుండి సార్థకపడెను. పిదప నేటు లాయెను.

శూర్ప.—ఆ క్రూరకర్ముఁడు సముద్రము దాఁటి లంకఁబ్రవేశించి రావణుని జంపి సీతను మరలఁ దెచ్చికొనెను.

మంథర.—అవు నమ్మా - వాఁ డతిసాహసి క్రూరాత్ముఁడు - కావున నే కామించిన నిన్ను మితిమించి గర్వించి ముక్కుచెవులు గోయించెను. అటులనే నాకాలు విఱిచెను.

శూర్ప.—ఏమీ! వాఁడు నీ కాలు విఱిచెనా? ఏల?

మంథర.—చిన్ననాఁడు నేనును వానినిఁ గామించి ముద్దించుచుంటిని. వాఁడు తుచ్ఛీకరించుచుండెను? అందులకు నే నాగ్రహింప బంతితో ననుఁ గాలు విఱుగ వేసెను. ఆ పగను బట్టి నారాణికి బోధించి యువరాజపదవినుండి వానినిఁ దప్పించి పదునాలుగేండ్లు వాఁడల

విని సంచరించులా గొనరించితి. మరలవాఁడు పురిఁజేరి రాజ్యపదంబునంది ఆ మిటారికత్తెయగు జానకినిఁ గూడి సౌఖ్యాంబు నిధిలోఁ దేలుచున్నవాఁడు దానిఁగని నా మది కుదురుచెడినది. తనువెల్లఁ గాలుచున్నది. కావున, నే నీవిజన ప్రదేశంబుఁ జేరితి.

శూర్ప.—అమ్మా! మంథరా! మనయుభయుల యర్థం బేకంబయ్యెను. అయిన దాయెను. కాఁదగినకార్యం బేమియో దాని నాలోచింపవలెను.

మంథర.—నాకెద్దియును దోఁపకకదా యీవనవాటికిఁ జేరితిని.

శూర్ప.—అది యాఁడుదాని లక్షణము కాదు. సాహసించిన యాఁడుది తన యుద్యమము ఫలీకరించునంతకు నిద్రింపదు. కావున నే, సర్వస్వము నాశనమైనను నాపగవాని సుఖభంగంబునకు నే నహోరాత్రులాహారవిహారాదులు వర్జించి ప్రయత్నపడుచున్నాను.

మంథర.—నేఁ బ్రయత్నపడి వ్యర్థమనోరథురాలనయి, నిరాశఁ గొని నిలిచినాను.

శూర్పణఖ.—అదికాదు నీవుమరలఁ బురిఁజేరి యింటనుండి, యింటి దాసీజనులతో నిచ్చకము లాడుచుండుము. పురినుండు నీచజనులం జేరి సీతను రావణుఁడు పట్టి చెఱచినాఁడని యపనిందఁ బ్రకటింపుము.

అటులొనరించినచో రాముఁడు జనకజ సద్గుణము సందేహించి దానిపైనుండు ప్రేమను తగ్గించును. పురుషుఁడు తన దారగుణము సందియించెనేని, నెల్లకాలము, నవ్విషయముఁ జింతించుచుఁ జీకాకు పడుచుండును. అందువలన మగవానిసుఖమునకు భంగముగలుగును. అట్టిసమయమున నాఁడుది యేరీతి నటించినను, మగవాఁడది సందియించుచు నుండును. ఇటులైన కొన్నిదినంబులకు నెద్దియో యొక నిదర్శనము దాని చెడుగుణమునుగుఱించి యగపడెనేని, దానియాఁగాములు



పురుషుఁడు చక్కఁగ విచారింపకయే, యదిసత్యమని నమ్మి భార్యను వదలును.

మంథర.—అవు నమ్మా: నీపలికినపలుకు లోకసహజము. జానకి పతివ్రత. అది చెడుగనుటకు నిదర్శన మెచటినుండి వచ్చును?

శూర్పణఖ.—అమ్మా-నిశ్చేతన పదార్థములకు సైతము చెవు లుండును. మన దురాలోచన లెవరు వినినను, మనకార్యమునకు భంగంబు గలుగును. కావున దానిని రహస్యముగ నుంచవలెను. ఇటు రమ్ము-చెవిలోఁ జెప్పెద. (అనుచు వీనులలోఁ బలుకును)

మంథర.—ఈ యుపాయము బాగుగనున్నది. ఫలించినచో నాదగు చిరకాల ప్రయత్నంబు సఫలంబగును.

శూర్పణఖ.—హెచ్చరికసుమా: ఇదిగో నేఁబలికిన వస్తువు. దీని నెవరికినిఁ జూపకు. ఒడలెల్లను కన్నులుగలిగి నటింపుము. త్వరలోఁ బురిఁజేరుము. నేనును గాలోచితముగ మాఱువేషమును ధరించి మనము పన్నినపన్నాగము ఫలించుటకు దారివెదకుచుండెద. కాలవిళంబము విప్రాయము. కావున వెడలుదము రమ్ము.

(నిష్క్రమము)

## చతుర్థరంగము.

### మందిరారామము-సీతారాముల వనవిహారము.

అనుబంధము 6. అనుబంధము 7.

శ్రీరాములు.—ప్రేయసీ! ఈయెలమావి చిగురులు తొగరు ఛాగరులడంచి చిగిరించుచున్నయవి. వనదేవతకు వసంతునిపైఁ గల, రాగాంకురముల బలెరాగిల్లుచున్నవి.

సీత.—ప్రాణనాథా, అరణ్యనివాసులగు జటిముఖ్యుల పెంజడలు వోలెఁ దేజరిల్లుచున్నవి.

శ్రీరా.—సీత! మధుపానవశుఁడై విరహిణుల హృదయములను దన శరములచేఁ గ్రుచ్చి యారక్తసిక్తములగు శరములిందు దాఁచినరీతిఁ దోఁచెడు.

సీత.—ప్రాణప్రియా, కొమ్మలు గట్టిన చెంగావిపావడలో యనురీతి విడంబించుచున్నయవి.

శ్రీరాములు.—సీతా, నీకరచరణాధరముల కెంపు ప్రతిబింబించి యాచిగురులకుఁ దొగరుజిగి హెచ్చెననునది స్వాభావికమయి యుండును.

సీత.—నాథా, ఆదిక్కుఁ గనుమా: కోకిలార్భకముల శ్రుతిమనోహరములగు సూక్తులు.

శ్రీరామ.—జానకీ! అవి యతను శాస్త్రానువాదములు వర్ణించుచున్నయవి.

సీత.—నాథా, ఈమావులపాద మూలముల భృంగీభృంగముల చెల్లాటల రొదలు వింటిరా:

శ్రీరామ.—ప్రేయసీ: నిజము. నిజము.

ఉ॥ మావుల పుష్ప రేణువుల మానగు పాదుల యంతరంబులన్
దావిఁ జెలంగ నూనరసధార నుమప్లవ మెక్కి హాయిగా
భావభవ స్తవంబులను బాడుచు భృంగము కాంతఁ జేరుచున్
మోవినినున్న తేనియను, ముద్దులఁ బీల్చుచు సంతసిల్లెడున్.

సీత.—నాథా, ఈ సరోవర మెంతరమ్యమైయున్నది. అందుండు పద్మపాళిపై మధుపములు ప్రాలి సుఖకేళిఁ దేలుచున్నవి గంటివియా?



గీ॥ పద్మపాళి, మధూలినిఁ బరఁగఁ గ్రోలి
హాళి మధుపాళి సుఖకేళిఁ దేలెఁ గనుమ.

శ్రీరాములు. ఇంతి: రసదాళి ధన్వికి నీసదాళి
నారియైగాదె, సుమపాళినారి నేఁచు.

సీత.—నాథా నీపదముల చమత్కృతిచే నన్నుహర్షాంబుధిలోఁ దేల్చుచున్నావు.

శ్రీరాము.—మోహనాంగీ! నేను స్వాభావిక లక్షణములఁ దెలుపుచున్నాను. ఇం దేచమత్కారము లేదు. నాతీ: నీవు గర్భవతివిగాన నలసితివి కాఁబోలు.

సీత.—నాథా నీవు నాసరసనుండుతఱి నాకెంతమాత్ర మలసటతోఁచదు. అనురాగంబున్నయెడ నెంతకష్టమగు కార్యమైన నది సులభముగఁ దోఁచుచుండునని యీననలుసైతము మనకుఁ గఱపుచున్నయవి.

కం॥ అనురాగంబున్నయెడన్
ఘనత, లఘిమఁ గాంచు టెచటఁ గన నైజంబే,
కొనగోటి సోఁకు సైఁపని,
నన యోర్వదె భృంగచరణ నారాచములన్.

శ్రీరాములు.—ప్రేయసీ చక్కఁగ వచించితివి. ఇట్టిబుద్ధి చమత్కృతికలదానవు నీవనికదా నీపైనా కనురాగంబు దినదిన ప్రవర్ధమానతఁ గనుచున్నది. నాతి మఱియొకటి నిన్నడుగ మఱచితి. నీవుగర్భవతివి. గర్భవతులకుఁ గోరికలు మెండని పెద్దలు వచింతురు. ఆకోరికలు నెఱవేర్పరేని గర్భమునఁగల శిశువు కృశించునఁట కావున, నీకెవ్వియయినను గోరికలు గలవేని సందియింపక నాకుఁదెలుపుము.

సీత.—నాథా నీయనుగ్రహమే నాకోరు కోరిక. అయినను బహుదినములుగ నన్నొక యాశ బాధించుచున్నది.

శ్రీరాములు.—నాతి: అదియేమి?

సీత.—ప్రాణపతీ; నామనమునం దంకురించిన యపేక్ష దమకుం దెలుపక, మఱి యేరికి విన్నవింతును?

సీ॥ కంఠీరవంబులు కరిశాబకంబులం గరుణను బెంచెడు గహనతలము
హరిణశాబకముల, నరయుచుం జనవిచ్చి మనిచెడికరులుండు, వనతలంబు,
ఎలుకలగుమిఁగని, యెలమిబిడాలము లనయముం బోషించునటవితలము;
పాములపై నెక్కి పాతరలాడెడి యాఖువారములుండు నవనితలము.

గీ॥ బాలశార్దూలముల మునిబాలు రెచటం
గనినం బట్టుచు నెక్కుచు గంతువేయు
జాహ్నవీతీర తలముల సంచరింప
మనము గోరుచు నున్నది మమత వినుమా॥

మోహనాంగా: ఇట్టితలంపు నామనమందంకురించినది. అదిఫలింపం జేయుభారంబు నీయది.

శ్రీరాములు.—మనోహారిణీ పదునాలుగేండ్లు వనవాస క్లేశంబునం గృశించి యిపుడే మో యించుక మదికి నెమ్మదిగలిగి యుండెను. మరల నీకుం గానన వాసంబేమేలని తోంచెగదా!

సీత.—నాథా: ఒకటిరెండు దినములటు లుండి మరలివచ్చెద. మీవియోగంబు చిరకాలము నే నోర్వంగలనా?

శ్రీరాము.—ప్రేయసీ! నీయిష్టంబురీతిఁగానిమ్ము సాయంకాలమైనది పోవుదము దమురమ్ము. అనుబంధము ౭. (నిష్క్రమము.)

పంచమరంగము

[redacted]

చాకలరంగడు. ఓబి. తో గ భీమయ్య. (చాకలరేవు) "చప్పనాళే"

భీమయ్య—(ఓబినిచూచి) ఏమే ఓబీ, ఎన్నిదినములు నీదారింజూచుచుండినను రాకపోతివి.



ఓబి.—ఏమిచేతును బావా! నాయత్త యన్నము నిదుర వదలి ననుం గాచుచున్నది. నామగని కేమో మోబోధించి నాపై ననుమానము కలుగం జేసినది. నేడు వారినెల్లం గనుమఱుంగం జేసి వారు నిదురించుచుండంగ నిచటికి వచ్చితిని.

భీమయ్య.—ఓబీ! ఈగజిబిజి మనకేల? నావెంటరమ్ము. హాయిగా నా యింటిలో నాలు మగనిరీతి సంసారము చేయనగును.

ఓబి.—ఆ ఏపటయినను కల్గా! నా పరివారలు నవ్వరా? నామగండు ననుం జంపండా! నాతలిదండ్రులు నను దండింపరా.

భీమయ్య.—అటులైన నీయాశ నేను వదల వలసినదేనా?

ఓబి.—అయ్యో బావా! నిన్నువదలి నాప్రాణము నిలుపఁజాలనే.

భీమయ్య.—ఎన్నిదినము లీయగచాట్లు.

ఓబి.—ఇటులనే యెటులయిన దొంగతనమున నినుం జేరుచుందును.

భీమయ్య—ఈదొంగతనము నాకు వలదు. దొరతనముగ నుండుదము రమ్ము. నీకేమి వచ్చినను నేం జూచికొనియెద, నీమీందెవరి వేలును బడనీను.

ఓబి.—బావా! నాకేమో భయ మగుచున్నది.

భీమయ్య—భయ మేమి భయమే! చూడు-మీ చాకలిదురి కాటమ నాయనితోం గూడుకొని సంసారముం జేయుచు జల్లంగలేదా! దానికి లేనిభయము నీకేమి?




ఓబి.—అటులయిన నన్ను రచ్చించుదువు గదా?

భీమయ్య.—సందియము లేదు, రమ్ము. [అనుచుం బిలిచికొని పోవును.)

(రంగని ప్రవేశము.)

రంగఁడు.—అయ్యో! కూడఁబెట్టిన సొమ్మెల్ల వెచ్చించి, చేతికిచ్చి తెచ్చుకొన్న పెండ్లామే బావిలోఁ బడెనో, ఎచటికి నెవరి వెంటఁ బోయెనో తెలియదు. మగతనమున బతికిన నాకింతటి కష్టము వచ్చెను. ఊరు వారి యారడికిఁ దట్టికొనలేక నిన్న రాత్రి దానినిఁ జావఁగొట్టితిని. అది యెపుడు పోయెనో తెలియదు. పాడుముండ యెచటికిఁ బోయిన నాకేమి యని యుందుదామన్న, "రంగసి పెండ్లాము రంకులపాలాయె" నని సరివారు నన్నుఁ జూచి నవ్వెదరు. ఈయవమానము నేనెటుల యోర్తును.

చుప్పనాక.—(చాకలిదాని వేషమున) ఏమిరంగా! చింతించుచుఁ దిరుగుచున్నావు?

రంగఁడు.—అవ్వా! నాపెండ్లాము ఓబి తప్పించుకొని పోయినది, వెదకెద.

చుప్ప.—అయ్యో పిచ్చివాఁడా! బోయ భీమయనాయకునిఁ గూడి చక్కఁదనము లాడుచు నౌకరిచేయ నౌకరుపట్టుకొని సమీపమున నుండు పల్లెదిక్కునఁ బోయిరి; నేఁ జూచితిని.

రంగఁడు.—అయ్యో నాగాచారమా! నాకు వానిపైననే యనుమానముండెను. అది నిక్కమాయెను. ఇపుడే వెళ్లి వానినిఁ జంపి దానినిఁ దెచ్చికొనియెద.

(అనుచు వెళ్లుచుండును.)

చుప్పనాక.—ఓరి అవమానఁపుముద్దా! నీవు దానినిఁ దెచ్చికొని మరల నేలెదవా? నిజము. రాజు, దరుమమే బంటులది. నీరాజు రాముఁడు తన పెండ్లామును రావణుఁ డెత్తికొనిపోయి యాఱు



నెలలు తన యింటనుంచుకొని యుండినను, మరలఁ దానినిఁ దెచ్చికొని పెద్దగ సంసారము చేయుచున్నాఁడు.

రంగఁడు.—అయ్యో! మా జానికమ్మ నటులాడెదవు. ఆయమ పతివత్తయే? నిప్పులో దునికి చెక్కుచెమర్పక సిక పూవాడక వెలికి వచ్చెనే.

చుప్ప.—బుద్ధిహీనుఁడా! అది నీవు నమ్మితివా! ఇంద్రజాల విద్దెము సేయువారు అగ్గితంబనము నేర్చి నిప్పులో దుముకరా? రావణుఁడు చెప్పి చేయించిన పోకిరిగదా! కోడలను విడవనివాఁడు యుండగత్తెయగు జానకిని వదలునా? నీకేల యాకలఁత. గాజులు దొడుగుకొని చీరలుగట్టుదానికున్న పౌరుషము నీకులేదా! నీవేమి మగవాఁడవు కావా! మీసములు లేవా? వయసులేదా! అది కాదనిన మఱియొకతె నీకుఁ బెండ్లామగును. నేఁ దెచ్చిచేసెద. వదలి పోయిన దయ్యమును మరలఁ దెచ్చికొనియెదవేల? దాని మొగముఁ జూడకు.

రంగఁడు.—అవ్వా! మంచిబుద్ధి చెప్పితివి. దాని నిపుడు పిలుచుకొని వచ్చుట యవమానమే కదా?

చుప్ప.—అవమానమని యడిగెదవా? దానికంటెఁ జావుమేలు.

రంగఁడు.—నిజము నిజము. నేనును పౌరుషవంతుఁడేను. అట్టికుని కెన్నటికిపోను. అది యెచ్చటనయినను చావని. దానిజోలి నాకేల! నిరాసఁ జేసికొని మఱియొక పెండ్లి చేసికొనియెద. అవ్వా పోయి వచ్చెద (రంగఁడు వెళ్లిపోవును.)

చుప్పనాక.—ఇచటఁ జేయునదంతయుఁ జేసితి. ఇఁక వీని యత్తగారింటికిఁ బోయి ఓబితోఁగూడ దాని తలిదండ్రులను బిలిచికొనివచ్చి

పంచాయితీ జేయించెద. రాముని చెవులకు జానకి విషయమగు నపనిందఁబడునంతవఱకు నారడి చేయుచుండెద.

(నిష్క్రమము.)



అరవరంగము.



చాకలవాని యింటి ముంగిలి.

చాకల రంగఁడు. ఓబిదుర్గి. ఓబితల్లి మారమ్మ. తండ్రిమారప్ప. చాకలి నరస, ఓబళేసు, చాకలి చుప్పనాక. చాకలమల్లు. గూఢచారి.

రంగఁడు — నే నెన్నటికి మీమాటవినను. ఆపాడుముండ మొగము చూడను. నాయింటికడపఁ ద్రొక్కనీయను. మీరేమి గడ్డమీదఁ గూర్చుని కనుబొమ లెగరవేయుచు మెటికెలవంటి మాటలాడుచుందురు. లోఁకలిమింగువానికి నాకుఁ గష్టము. అవమానము మీకా? నాకా?

మారమ్మ.—ఏమిరా! నీవింతకోపపడిన గతియేమి. ఏమీ తెలియని పిల్ల కోపపడి నోటికూటికి జాయికొట్టుకొనినది. ఇపుడు బుద్ధి వచ్చినది.

రంగఁడు.—ఔనులే! మళ్లివట్టి మాటలాడకు. ఎముకలు విఱిచికొని కన్నవారి కాళ్లుగడిగి దుష్ట పోగుచేసికొని యీచెడ్డముండను కట్టుకొని నాయిల్లు పాడుచేసికొంటిని అవమానము తెచ్చికొంటిని. ఇంటితనమును జెడఁగొట్టికొంటిని.

మారప్ప.—ఏమిరా! యేమి దిమాకు పడియెదవు. నాపిల్లచేసిన తప్పేమి?



రంగఁడు.—తప్పా! సరి, ఇల్లువిడిచి పోయిన దొకతప్పు, పరాయి మగవానిఁ గట్టికొని పోయిన దొకతప్పు. వానితో సంసారము చేయుచుండిన దొకతప్పు.

మారప్ప.—ఏమిరా నోరుమూయుము. క్రొవ్వి మాటలాడకు, నా పిల్ల నడతఁ దప్పుపట్టెదవా? ఏమో కోపపడి యిల్లువిడిచెను. దోవపట్టుకొనివచ్చి పుట్టినిల్లుచేరెను. దోవలో మగవాఁడు పరా డఁ గూడదా?

నరస.—రంగా! ఏమయినను గాని యింటివిషయ మింతయాఁరడి సేయ రాదు. ఇంటగుట్టు పెరుమాళ్లకుఁ దెలుసు ననురీతి నుండవలెను. మనభార్య చెడుగు మనకొకవేళఁ దెలిసినను దానిని రట్టుసేయక గుట్టునుమింగిన పల్లివలెఁ గుటకలు మ్రింగుచుఁ గూర్చుండవలెను.

చాకలమల్లు.—అంతగాక! చిన్ననాఁడు నాకు నిటులనే యయియుండెను. మీబోటి పెద్దలమాటవిని మరల దాని నింటిలోనికి రానిచ్చితిని. ఇపుడే యదేపిల్లల తల్లియై యూరికఁ బెద్దయయినది చిన్ననాఁడది యెంతి చెడ్డదిగానుండిన నిపుడంతగరితగనున్నది. కావున నోట్లో వేలుబెట్టుకొని యూరకయున్నాను. ఇపుడైన నావిషయము దలఁచికొనినపుడు నేను దుఃఖపడుచున్నాను. అదియు దుఃఖపడు చున్నది.

చుప్పనాకమ్మ.—అవునయా! నిజము. ఆడుదానినిఁ బట్టువా రెవరు! మగవాఁడు చూచియుఁ జూడనటు లుండవలెను. మనరాజు రాముఁడుచూడు. పెండ్లామును పరాయి యాతఁడాయి ఎత్తుకొని పోయి ఆఱునెల లింట నుంచుకొని కాపురము చేసినను మరలఁ దానినిఁ బిలిచికొని నాభార్య గరిత యని నెత్తినిఁబెట్టుకొని శివా

లాడుచున్నాడు. ఆమే మో యగ్గిలో దుమికి వెలివచ్చెనట. రాజు నమ్మెనట. పిల్లకి జ్వరమువచ్చెననిన నెవరు నమ్ముదురు? కోడలిని విడువని రావణుడు సీతను విడిచియుండునా! కడకు ఒళ్లంటి యుండఁడా! ఎత్తుకొనిపోయి రథమం దుంచుకొనఁడా? ఇవి యన్నియుఁ గొన్ని దినాలకు మాసికొనిపోవును. (రంగయ్యను చూచి.) రంగయ్యా! ఏమో అయినది యయినదేను. ఏమో ఆ బోయ భీముఁడు రెండుదినములు వద్దనుంచుకొనియుండి బుద్ధి చెప్పి పంపినాడు. పాపము వానికి భార్యలేదు. ఏమిచేసును. నీవు పెద్ద మనసు చేసికొని మీరాజు బలె దానితో సంసారము చేయుచుండుము.

రంగఁడు — (కోపమున) నేనేమి రామునివంటి షండప్పనుగాను. నాకుఁ బౌరుషమున్నది. మొగముమీద మీసము లున్నవి. ఎన్నటికిని మీమాటలు నేవినను.

మారమ్మ.—ఓరంగా! నీయక్కను నేను, నామాటవినుము. ఆపసిపిల్ల నిన్నువదలి యెచ్చటికిఁ బోవును? కొన్నిదినము లూరక నీయింట నుంచుకొని యుండుము. దాని నడత చక్కఁబడదేని అపుడు నీ యింటినుండి తఱిమివేయుము.

రంగఁడు.—అటు చేయుటకు రామునివంటి మానహీనుఁడనుగాను. నాయింట నదికాలిడినచో దానిం జంపి నేఁ జచ్చెద.

మారప్ప.—ఔరా! యీతగాడు బలు పౌరుషవంతుడు. [మారమ్మను గని] రావే! పోవుదము, వద్దనిన వానిబట్టికొని యేల యేలాడెదవు! మనబిడ్డ మనకు బరువా? దీనికేల యంగలార్చెదవు. రేపే యీవార్త మనరాజునకు దెలిపి తాళిబొట్టు తెంచి వేఱొక



నికి ముడివేసి యిచ్చెద మనతో యాడిన పౌరుషపు మాట రాజుతో నాడనిమ్ము. వీరందఱు సాక్షులుగ నుందురు.

దుర్గి.—ఏమయ్యా! సంసారము తెంచు మాటలాడి కోపపడి పోయెదవు. ఇటులయిన తెగిన సంసార మెటు తేరును. రాజునకు జెప్పి నాకొడుకును గొలితవేయించుట నీకు దరుమమా? (రంగని జూచి) నాయనా! రంగా! మామపై యేల కోపపడియెదవు? పసిపిల్ల తెలియక యిల్లువిడిచిన మాత్రాన నింతగ దానిపై కినుక యేల? అది దుష్టతనము చేసినది యెవరు చూచినారు? వట్టి యనుమానము నీకేల? ఈరట్టేల?

రంగఁడు.—అయ్యో! నేనోర్చుకొనిన నాసరివారు నను జూచి నవ్వుదురు గదా?

దుర్గి.—అయ్యో! సరివారిని గట్టికొని నీవేల సంకటపడియెదవు? తనయన్నము తాను గడించుకొని చల్లగ నుండువానిని గనినచో నిరుగు పొరుగుననుండు సరివారికి సంకటము లేచును. ఎటులనయినను నిన్ను పాడుసేసి రాజుగారిల్లు తాము చేసుకొనవలెనని వారు యత్నించుచున్నారు.

రంగఁడు —నాబొందిని ప్రాణముండువఱకు కావని యెన్నటికిని కాదు. ఏమయినను నేను వదలుదును. రాజుగారి యిల్లువదలుదునా?

మారప్ప.—ఎటుల వదలవో నే జూచెద. రాజుగారివద్దకు బోయి కండకావరమున నీవు కూసిన కూతలు వారికి దెలిపెద. నిన్ను యిల్లుతప్పించి కొలిత వేయింతురు.

రంగఁడు.—(మామకాళ్లు బట్టికొని) మామా! తెలసీ తెలియక చేసినతప్పున కింతకోపపడిన నాగతియేమి? నీబిడ్డను నే నింటిలో నుంచుకొని సంసారము చేసెద. నన్ను రచ్చింపుము,

మారవ్వ.—అటులయిన సరె, బిడ్డా వోబీ! బుద్ధిగలిగి మగనితో సంసారము చేయుము; పొమ్ము.

ఓబి.—నాకేమియవలదు, నేను మీవెంటనే వచ్చెద. ఇచట వీనితో శ్రమపడలేను. దెబ్బలుతినలేను. నిలిచితే తప్పు. కూర్చుండితే తప్పు. పండుకుంటే తప్పు. లేచియుంటే తప్పు. కూడుతింటే తప్పు. తినకున్న తప్పు. వీనికెల్ల నావీపు జీలునటుల దెబ్బలు.

రంగఁడు.—ఏమే! అటు మాటలాడెదవు. అట్టి తప్పులుబట్టి నిన్నెన్నడు కొట్టియుంటినే? ముద్దుగ బెంచుచుంటినిగదే.

ఓబి.—మొద్దా! బోయ భీమునితో మాటలాడితివని నన్నానాడు గొట్టలేదా?

రంగఁడు.—ఏమే పరాయిమనిషితో మాటలాడరాదని బుద్ధిచెప్పుటకై కొట్టితిని. అందుకు గోపమేల?

ఓబి.—ఇతనితో మాటలాడనియెడల యతనిబట్టలు తెచ్చుటెటుల? ఉతుకుటెటుల? చాకిరి చేయుటెటుల? చాకలది పరాయిపురుషునితో మాటలాడుట తప్పా? మాటమాటకు అనుమానమువడు నీతో నే నెటు సుఖముగ సంసారము చేతును?

రంగఁడు.—ఏమే బుద్ధివచ్చెను. ఇంక నీ వెవరితో మాటలాడినను నిన్నేమనను; మన రాములబలె నోరు మూసికొని యూరకయుండెద రమ్ము. ఇంట్లోపోదము, రచ్చయేల.

(నిష్క్రమము.)

# ద్వితీయాంకము.

## ప్రథమరంగము.

విజన ప్రదేశము.

మంథర - శూర్పణఖ.

శూర్పణఖ.—మంథరా! నీ కేల? నేఁ జెప్పినంత పని చేయుము.

మంథర.—అమ్మా శూర్పణఖా! ఆకోఁతి యెల్లప్పుడు సీతారాములున్న చోట నుండును. నన్నుఁ జూచిన కను లెఱ్ఱఁజేసికొని పైకి నెగడు లాగు నటించును. పడకటిల్లు నే నెటు ప్రవేశింతును?

శూర్పణఖ.—ఛీ! నీ వేమి యాఁడుదానవే. సాహసికురాలగు నాఁడుది యన్నిట నారితేరి యుండవలెను.

మంథర.—నిజము. నాకేమో భయమెత్తుచున్నది. అమ్మా, చుప్ప నాకా! అదియేమో చాఁకలదాని విషయము చెప్పుచుంటివే, అది రాముని చెవికి నెక్కుటెటుల?

శూర్పణఖ.—నే నపుడే గూఢచారిని నామాయలచే లోఁబఱచికొని తూ-చా తప్పక జరిగినదంతయు నీరాత్రి రాముల కెఱిఁగించు నటుల ఏర్పాటొనరించినాను. దానిని నిశ్చయించు నీవు వాని పడకటిల్లు జేరి యావస్తువును సీత తలయంపిక్రింద నుంచియుండు మని నేఁ బలికితిని. దానికి నీవు భీతిల్లెదవు.

మంథర.—అవునమ్మా చిక్కితే నాకండలు చెక్కుదురే!

శూర్పణఖ.—అంతటిభీతితో నీ వెంతటిపనిఁ జేయఁగలవు? నీవు వట్టి మాటలమల్లివి. కాని యింతవట్టుకయినను నాకు సాహాయ్యము చేయుము. ఆసీతపాన్పు సిద్ధపఱచుదానిని నాకుఁ జూపుము.

మంథర.—అయ్యో! మనరహస్యము దాని కేల తెల్పెదవు. అది గయ్యాళి. ఊరువల్లె యొకటి చేయును.

శూర్పణఖ.—నీ కేల యాభయము. నేఁ జెప్పినంతపనిఁ జేయుము. నే నెటులయినను నాపని నేఁ జక్కఁబెట్టుకొనియెద.

మంథర.—అటులయిన దూరమునుండియే యాదాసినిఁ జూపెదను రమ్ము.

శూర్పణఖ.—పోవుదము రమ్ము.

(నిష్క్రమము.)

---

ద్వితీయరంగము.

---

పడకటిల్లు.

(1) దాసివేసము బూనిన శూర్పణఖ. (2) సీత. (3) రాములు. (4) గూఢచారి (5) లక్ష్మణుఁడు.

దాసి.—(స్వగతము) ఈయింటిదాసి నేఁడు తలనొప్పితోఁ బనిసేయఁజాల నిద్రితయై యున్నది. దాని స్నేహము సంపాదించుకొని దానిపనులు నేఁ జేయునంతటి స్వాతంత్ర్యము తెచ్చుకొంటిని. నేఁ డది రానందునఁ బడకటిల్లు చక్కఁబెట్టుచు పని నా దాయెను. నాతలంచిన తంత్రము ఫలీకరింపఁజేయుటకు నింతకంటెను మంచి సమయము వేఱొకటి దొరకదు. ఇపుడు నే నేమఱితసేని నాపగ సాధింప



దుస్సాధ్యమగును. (ఒకపటము వెలికిఁ దీసి చేతిలో నుంచుకొని) దీనిని వ్రాయుటకు నాప్రావీణ్యమంతయు వెచ్చపెట్టితిని. నాతండ్రి వలన నేర్చిన మాయలన్నియును వినియోగించితి. దానిఫల మిది. ఔరా! ఈపట మెంత ముచ్చటగ నున్నది. ఆమాయలాడిని నా రావణుఁడు కౌఁగిలించుకొని యేకశయ్యను శయనించినది చూపఁబడినది. కౌఁగిలింతలు చుంబనాంకములు మొదలగు చిన్నెలన్నియును జెన్నుగ లిఖించితిని. ఈచిత్రరేఖ రాములకంటఁ బడులాగున జేయవలెను. దీనినిఁ జూచిన క్షణముననే తనసతి పాతివ్రత్యమును సందియించును. దినక్రమేణ యాసందేహానలాంకురము రవిలి మంట లగును. దానిఫలము ముందు నేఁ గనులారఁ గని సంతసించుచుండెద. రాముఁడు దీనినిఁ గను టెటుల? (ఆలోచించి) సరి బాగుగ నున్నది. ఈవిషయమున నాలస్యము విషమగును. పోయెద. (అనుచుఁ బోయి శయ్యపదలించి [illegible] తలగడక్రిందఁ దనచేతి పట ముంచును.) హా! నా చేయు పనియంతయును జేసితి. ఇఁక వేగమున గూఢచారినిఁ బ్రేరేచి యీరాత్రి సీతపైఁ గల నిందలు రాముఁ డెఱుఁగులాగునఁ జేయవలెను. ఆ సమాచారంబు విన్నతోడనె రాముఁడు నెమ్మదిచెడి నిదురలేక చింతించుచు బడకపైఁ బొరలుచుఁ దుద కీ చిత్రరేఖను జూచి సీతపైఁ గల యపవాదము సకారణమైనదని యెంచి సీతను జంపించును. లేదేనిఁ గాననంబునకుఁ బంపించును. సౌఖ్యవిహీనుఁడై తాను తపించును. ఇదియ నా బూనిన ప్రతిన ఫలించు సమయము. పోయెద.

(నిష్క్రమము.)

---

సీత.—(ప్రవేశించి) వనవిహారంబున నేఁ గడు డస్సితిని. నిదుర నేఁ డేలొకో నన్నిటులటుల గదలనీయదు. ఎపుడు పడకఁ జేరుదునా యని యాతురపడుచున్నాను. నా ప్రాణప్రియుని రాకకు నేఁ డించుక తడవగునఁట. అంతవఱకు నేను వేచియుండుటకు నాకు వలను పడదు. పతి యనుమతి ననుసరింపక సతి పతికంటెను మున్నే శయనించుట పాతకము కాదని నేఁ దలంచెద. (అనుచుఁ బడకపై శయనించును. (శ్రీరాములు ప్రవేశించి సీతను జూచి)

(అనుబంధము 9.)

హా! హా! ఈ జనకాత్మజ కుసుమకోమలాంగి. నేఁటి వనవిహారంబునఁ గడు డస్సి నిదురించుచున్నది. ఇట్టి శిరీషసుమోపమాంగి పదునాలుగేండ్లు కంటకావనీ సంచారక్లేశ మెటు లోర్చెనో! అపటుతర దురాత్మకుఁ డిడు సంకటము లెట్లు సైఁచెనో! ఆవనవాసంబున నీసతి,

సీ. కంటకావనిలోనఁ దుంటమెకంబులు సఖులుగా భావించి సంచరించె,
కఱకుటాళ్లల భూరి కాంతారవసతులు మణిమందిరము లని మదిని నెంచె,
విషమాటవీస్థలీ వివిధపాదపముల నారామతరువార మని తలంచె,
భూరి నక్రగ్రాహసారసాకరములు కొలనులుగాఁ గొని కొమరుఁగాంచె.

గీ. కందమూలంబు లరిది మాకందఫలము
లనుచు భక్షించి క్లేశంబు లనుభవించె
విధివిరోధించి బాధించె వివిధగతుల
కుసుమకోమలగాత్రను గొంకుదక్కి.

[అనుచుఁ జింతించుచు] అట్టిదురవస్థ యతివలకు నెన్నఁడును సంభవింపఁగూడదుకదా..............ఏమి యచ్చెరువిది; పదునాలుగేండ్లు పలువిధముల కష్టంబులఁ గృశించియు దినదినము మరలఁ దన్ను భాగీరథీతీరకాంతారములకుఁ బంపుమని బాధించుచున్నది. కారణ మేమి యుండును? ఇట్టికోరిక యీసతికి నేల పుట్టియుండును!



ఈ కుటిలకుంతల కిట్టి తలంపు పుట్టుట కెద్దియో కారణముండవలెను. ఉండక తప్పదు..............అటులేమయినను కారణమున్న నాప్రాణప్రియ దానిని నాకుఁ దెలుపక దాఁచునా! ఏమో! కుటిలాలకల కుత్రలు బ్రహ్మకైనను దెలియ నలవి కాదు కదా!......ఏమీ; నాసతిపైననా, నాముద్దులరాణిపైనా, ప్రాణప్రియపైననా, నాకిట్టి యనుమానము! ఒకగడియయైనను నన్నెడబాయఁజాలనని పలుకునట్టి యీచెలికి నిపు డీబుద్ధి యేల పొడమియుండును!......... ఏమి యీయాలోచన, వలదు. తగదు. న్యాయము కాదు. నిజము తెలియక సందియములపైఁ దుదికుదురు చెడుట పురుషధర్మము కాదు. అది యాడుదానికిఁ దగును...........అయినను రేపు ప్రాతఃకాలముననే భాగీరథీతీరకాంతారములకుఁ బంపెదనని యీచంపకనాసకు మాట యిచ్చితినిగదా, పంపవలెను. సతికి నిచ్చిన మాట తప్పుట శ్రేయస్కరము కాదు పైఁగా సీత గర్భిణిస్త్రీ. అట్టి యువతి కోరిక నెఱవేర్పనేని గర్భమున నున్న శిశువు కృశించును. ఎటులయినను నేఁ బంపవలెను. సీతావియోగము మరలఁ గొన్నిదినంబులు నే నెటులయినను భరింపవలెను. నాప్రాణప్రియను దోడ్కొని పో నాతమ్ముఁడు లక్ష్మణుఁడు తగును. వానినిఁ బిలిపించెద. [అనుచు] ఎవఁడురా సేవకుఁడు.

భద్రుఁడు.—[గూఢచారి] స్వామీ నేను గూఢచారిని.

రాముఁడు.—ఏమీ! గూఢచారీ పట్టణంబంతయు మారువేషంబుల సంచరించి యందందు జరుగు సమాచారంబులు దెచ్చి నాకుఁ దెలుపుచుండుమని తెలిపియుంటినికదా, మూఁడుదినములుగ నీవు నాయొద్దకు రావైతి వేల? పట్టణమందేవియు విశేషంబులు లేవా? జనులందఱు క్షేమముగ నున్నవారా! నన్నెవరును దూఱరుకదా! నిజ మాడుము.

భద్రుఁడు.—స్వామీ! ఆమాటలు నన్నడుగ నేల?

చ. జనకుని యాజ్ఞఁ బూని గురుజన్నము గాచి ఖరాది దైత్యులన్
దునిమి ముదంబు మీఱఁ బదధూళిని ఱాతిని నాతిఁ జేసి యీ
శుని విలుఁ ద్రుంచి సీతఁ గొని సూరిజనుల్ నుతియింపఁ బ్రేమతో
జనులను నేలు భూవిభుయశంబునఁ గల్గునె దోష మెన్నఁడేన్.

స్వామీ! ఇట్టి నిష్కళంకమూర్తి వగు నిన్నెవరు దూషింతురు?

రాముఁడు—భద్రా! నావిషయంబున నీకుఁ గల మేల్తలంపు సహజమైనది. పట్టణవాసులు నావిషయ మేమి దలంతురో దానిని విన నపేక్షించి నిన్నడిగెదను? యథార్థము పలుకుము.

భద్రుఁడు—స్వామీ! జనులమాటలు తమ కేల? భిన్నాభిప్రాయములచే జనులు మాటలాడుచుందురు.

ఉ. దయచే నేలెడువానిఁ గన్న మృదులత్వం బెంచి దూషింపరే?
భయముం జూపెడి వానిఁ గన్న ననరే పాపిష్ఠియం చెప్పుడున్?
జయ మార్జించెడి ధైర్యశాలిఁ గన హింసాశీలుఁడం చెన్నరే?
ప్రియమారా! జనులాడుమాటలను నమ్మన్ గల్గునా నాపదల్?

స్వామీ! జను లాడుమాటలు వీనులఁ బడ వినిన రాజొక్క దినంబైనను సౌఖ్యమున రాజ్య మేలఁజాలఁడు ఆమాటలు తమ కేల?

రాముఁడు.—భద్రా! నీమాటలయం దర్థము విశేషముగ నున్నది. నీవు స్వామిద్రోహివయి పట్టణంబున జరుగు మాటలు నాకుఁ దెలుపక యున్నాఁడవు.

భద్ర—స్వామీ! తమ యుప్పుఁ దిని జీవయాత్రఁ జరుపు మీ సేవకుని మొడలనా యింతటి పెద్దమాటలు! తమ నెమ్మదికి భంగము గలిగించు సమాచారంబు తమవీనులఁ బడఁద్రోసి పాపము నొడిఁగట్టుకొనుటకు భీతిల్లి మౌనము వహించితినిగాని వేఱొకటి కాదు.



రాముఁడు.—భద్రా! అట్టిభీతి నీకు వలదు. ఎట్టి సమాచారంబైనను నాకుఁ దెలుపుము; దాఁపకు.

భద్ర.—స్వామీ! కుత్సితపురుషులు సోమరిపోతులై రచ్చపట్టున గుమిగూడి యితరులను తుచ్ఛముగ మాటలాడి యపనిందలు గట్టుచుందురు. నీచులవచనంబు లేమని తమవీనులఁ బడవేయఁగలను?

రాముఁడు—భద్రా! నీవు వెఱవకు; ఎవరివిషయమున నెవ రపనిందలు గట్టి నీచము లాడిరి?

భద్ర.—స్వామీ! ఆమాటలు నే నుడువఁజాల.

రాము.—భద్రా! నీ వది నాకుఁ దెలుపక తప్పదు.

భద్ర.—రామభద్రా! అవి వినుటవలన స్వామికి మనఃక్లేశంబుగాని లాభ మేమియు లేదుకదా.

రామ.—ఈ యధికప్రసంగము నీ కేల? జరిగినసంగతిఁ దెలుపుము.

భద్ర.—స్వామీ! మీరు నన్నింతగఁ గ్రుచ్చి గ్రుచ్చి బలవంతపెట్టుచున్నవారు కావునఁ జెప్పక తప్పదు. మొన్నటిదినంబున నడిరేయిని నేను చాకలివారవీథిలో సంచరించుచుంటిని.

రాము.—అచ్చట నేమి జరిగెను?

భద్ర.—అచ్చట రచ్చపట్టునఁ జాకలివా రెల్లరు వచ్చి గుమిగూడి యుండిరి.

రామ.—ఏల?

భద్రు.—మన చాకలివాని భార్యను ఎవఁడో యెత్తుకొనిపోయి యొక్క దిన మింటనుంచుకొని యుండెనట.

రామ.—పిదప.

భద్రు.—ఆకొంచెముఁగారణంబున చాఁకలివాఁడు భార్యను చావఁదన్ని పుట్టినింటికిఁ దఱిమెనఁట.

రామ.—తరువాత.

భద్ర.—పుట్టినింటివారు దానినిఁ బిలిచికొనివచ్చి మగనియింటిలో విడువ యత్నించిరఁట. దానిని ఇంటికి రానియ్యఁ జాఁకలివాఁడు సమ్మతింపఁ డాయెనఁట.

రామ.—పిదప.

భద్రుఁడు.—పుట్టినింటివా రపుడు చాఁకలి పిన్నపెద్దలను జేర్చి వానికి బుద్ధిచెప్పుచుండిరి.

రామ—వాఁడు సమ్మతించెనా!

భద్ర.—సమ్మతింపక కొన్ని పలువకూఁతలు కూసెను. కూడిన జనులు వానికి సమాధానముగఁ గొన్ని పలుకులు పలికిరి.

రాము.—వాఁ డేమి పలికెను!

భద్ర.—స్వామీ! ఆమాటలు మీరు వినఁగూడనివి. నేఁ బలుకఁ జాలను.

రాము.—భద్రా! నీవు భద్రముగ నుండఁదలంతువేని నామాటలెల్ల వివరముగఁ తూ-చా తప్పక నాకుఁ దెలుపుము.

భద్ర.—స్వామీ! ఇంతగ బలాత్కరించినపుడు నాయత్న మేమి యున్నది? నా కది యిష్టములేకున్నను దెలిపెదను.

రామ.—త్వరగఁ దెలుపుము.

భద్ర.—స్వామీ! ఇక్ష్వాకుకులమున నే కళంకము నుండలేదఁట.



రామ.—నిజము. అది సంతోషకర మగు సమాచారము.

భద్ర.—అట్టి నిష్కళంకమగు కులమున మీరు పుట్టితిరఁట.

రామ.—నిజము. కా దనినవా రెవరు!

భద్ర—ఆకులమునకు మీరు కళంకము దెచ్చితిరఁట.

రామ.—నేనా కళంకము దెచ్చినది? అది యెటుల!

భద్రు.—స్వామీ! ఇంత వినినది చాలదా? ముందు సమాచారంబు వినుట కసహ్యముగ నుండును.

రాము.—అది నేను వినవలెను. వినక తప్పదు.

భద్ర.—అటులయినఁ దెలిపెదను.. మీరు మన జానకమ్మను గూడి వనవాసమునకుఁ బోయియుంటిరిగదా.

రామ.—నిజము. కానిమ్ము. త్వరగఁ దెలుపుము.

భద్ర.—అకాలమున విటాగ్రగణ్యుఁడగు దోషాచరాగ్రణి రావణుఁడు మనసీతమ్మ నెత్తికొని రథమెక్కి తొడమీఁదఁ గూర్చుండఁబెట్టుకొని లంకకుఁ గొనిపోయి యాఱునెల లిల్లాలుగ నేలినను సిగ్గులేక రోఁత యనక యామెను దెచ్చికొని కాముకుఁ జిక్కి యామెకు దాసానుదాసుఁడవై యేలుచున్నావఁట. రాజధర్మమే ప్రజలదని పలికి చాఁకలిఁదానిని నేలుమని దానివలెకి బోధించిరి.

శ్రీరామ.—(వ్యసన మభినయించి) భద్రా! ఆమాటలువిని చాఁకలివాఁ డేమి పలికెను!

భద్ర.—వారి నెదరించి సీతగుణముఁ బ్రస్తుతించుచు వాఁడు మాఱు పలికెను.

రామ.—అందులకు వా రే మనిరి ?

భద్ర.—దేశమెల్లెడను సీతవార్త జనలనోట వాఁగుచున్నదఁట. జానకి దాసీజను లెల్లరు వెనుకముం దీవార్త నన్కొనుచున్నవారఁట. కేలుంబవల్లు సీతకు రావణునిపై వ్యామోహమఁట. వానినిఁ దలంచుకొని యొంటరిగ వానియాకారముఁ జూచుచు నేడ్చుచుండునఁట.

శ్రీరామ—అందులకు చాకలివాఁ డే మనెను.

భద్ర.—అటులయిన రామునివంటి సిగ్గుమాలినవాఁడు తాను కాదని పలికెను.

రామ.—[హా యని నిట్టూర్పు సారించుచు] భద్రా! సీత దాసీజనులలో నెవతెయయిన నిచట నుండినఁ బిలిచికొని రమ్ము.

భద్ర.—చిత్తము. (అనుచు నిష్క్రమించును.)

శ్రీరామ.—హా! హా! నేఁటికి సీతవిషయమున నిన్నికఠినోక్తులు నా వీనులఁ బడెగదా!

ఉ. వీనులవిందుగాను మును వింటినిగాదె మునీంద్రు లాడఁగా
జానకివార్త దానికి నసంగతిగా జను లాడఁ బూనిరే
మానిని శీలసంపదలు మానని నిర్మలచిత్త యంచు నా
చానగఁ గొంటిఁగాని వ్యభిచారిణి యంచుఁ దలంపనైతిగా.

హా నే నేమి సేయుదు! ఈనింద నే నెటుల భరింతు. (ఆలోచించి, ఏమీ! యాలోచన (సీతను జూచి) హా. హా. ఈకుసుమకోమలాంగి, ఈనిర్మలగాత్ర హృదయపేటికలో కలుషకళిక మగునాత్మ చేరునా! ఎన్నఁటికినిఁ జేరదు. (మరల నాలోచించి, అటులైన జనులాడుకొనుటకుఁ గారణ మేమి? అగ్నిలేమ ధూమ ముండదు గదా! జానకి సచ్చారిణిఁ గాని జారిణిఁ కాదు. గాని నాకుఁ గలిగిన



యపనిందకు నే నెటు సైతును. ఏమి యాలోచన యిది! నాప్రాణప్రియ, నాముద్దులరాణి, నన్నుఁ గాదని వేఱొకనిఁ గోరునా!......
ఏమో స్త్రీహృదయ మెఱిగినవాఁ డెవఁడు. నిజమనుటకు సాదృశ్యము లే నపుడు సందియించుట తగదు. దాసి రానిమ్ము. (అనుచుఁ జింతించుచుఁ గూర్చుండును.)

[భద్రుఁడు దాసితో బ్రవేశించును]

భద్రుఁడు.—స్వామీ! దాసి వచ్చి తమయానతికి వేఁచి నిలిచినది.

రాముఁడు.—[దిగ్గున లేచి దానినిఁ జూచి] దాసీ! నీరాణివార్త నీ వెఱిఁగిన దంతయును దెలుపుము. ఏమాత్రమును దాఁపకు.

దాసి.—స్వామీ! దాఁప నేల? నేఁడు వనవిహారమునఁ గడు బడలి నిదిరించుచున్నది.

రాము.—ఆవార్త నాకుఁ దెలియును. ని న్నేవ రడిగిరి?

దాసి.—మఱి యేవార్త స్వామీ! న న్నడిగినది?

రాము.—సీతయొక్క శీలసంపదను గుఱించి.

దాసి.—దాని కేమి కొదువఁ గలిగినది. నేఁ గని యెఱుఁగను. దినము స్నానముచేయును. ఆచారము సేయును. మిముఁ బూజించును. మీరు భుజించినపదప భుజించును. తాము నిదురించినవెనుక తాను నిదురించును. తాము లేవకమునుపే తాను లేచును.

రాము.—ఇవి నేనును గుర్తెఱుఁగుదును. ఆవిషయము గాదు నే నడుగునది.

దాసి.—మఱి యేవిషయమో నాకుఁ దెలియదుగదా!

రాము.—జానకి పాతివ్రత్యమును గుఱించి.

దాసి.—అది నా కేమి తెలియును? తెలుంబవల్లు మి మ్మెడఁబాయక యుండునే? అటు లుండునపుడు పాతివ్రత్యమునకు భంగ మెట్లు గలుగును!

రాము.—దాసీ! ఇపుడుగాదు. వనవాసంబున సీతను రావణుఁ డెత్తికొని పోయెనుగదా! న న్నెడఁబాసినపుడు సీత తనపాతివ్రత్యము గాపాడుకొనెనా లేదా.

దాసి.—అపుడు సీతవెంట నే నుండలేదే!

రాముఁడు.—నీ వచటనుండలేదు. నిజము. ఇచటికి వచ్చినపిదప సీత యాదుష్టాత్ముని రావణుని నెపుడయిన దలఁచుచుండెనా?

దాసి.—స్వామీ! తలచుట మనమున జరుగు విషయము. నాకెటు తెలియును!

రాము.—ఎపుడయినను వానివిషయము మీతోఁ బ్రస్తావించు చుండెనా!

దాసి.—స్వామీ! నేనాఁడుదానను గానా! నన్నిటు లడుగవచ్చునా!

భద్రు.—స్వామీ! స్త్రీలు దండసాధ్యులుగాని గుణసాధ్యులుగారు.

రాము.—దాసీ! అవిషయమున నీకుఁ దెలిసినవార్తఁ దెలిపెదవా! నిన్ను శిక్షింతునా!

దాసి.—స్వామీ! స్త్రీ రహస్యవార్త భర్తకుఁ దెలుపుట స్త్రీ ధర్మము గాదు.

రాము.—నీకుఁ బ్రాణాపేక్షఁ గలదేని నిజము పలికి బ్రదుకుము.

దాసి.—అయ్యో! ఇది నా గ్రహచారము. నను బెంచిన తల్లిపై నే నిటు నిందమోపుదును. నిజము తెలుపకున్న నేను బ్రదుకు టెటుల!



రాము.—దాసీ! నిజము పలుకుము. నీకే పాపమును రాదు. భయము లేదు.

దాసి.—[తలఁ గొట్టికొనుచు] నాకిది తప్పనిపని. స్వామీ! ఆవార్త తమకేల? స్త్రీల చర్య లంతగఁ బట్టుపట్టి పురుషుఁడు ప్రశ్నించుట తగదు.

రాము.—దాసీ! ఆయధికప్రసంగము నీకేల? యథార్థము తెలుపుము.

దాసి.—స్వామీ! అపుడపుడు నారాణి యొంటరిగ నుండునపుడేదో యొకచిత్రరేఖను జూచుచుఁ గన్నీరుగార్చుచు హా! నీతోఁ గలసి యుండుభాగ్యము నిర్భాగ్యయగు నాకు లేదాయె నని పలవరించు చుండును. దాసీ లెవరయిన నెదురుపడిన నాచిత్రరేఖను మఱుఁగు పఱచును. ఇదియ నే నెఱిఁగినవార్త.

రాముఁడు.—[నిట్టూర్పులు సారించుచుఁ జింతించుచుఁ గూర్చుండి] దాసీ! ఆచిత్రరేఖ నీ వెపుడయినను జూచితివా! నిజము పలుకుము.

దాసి.—స్వామీ! నేనును దానిని పలుమాఱులు చూచినాను. సీత తన తలగడక్రింద నెల్లపుడును దాని నుంచికొని పరుండును. ఒకానొకదినమున నేమఱి యటులనే విడిచి పోవును. మరల వచ్చి వెదకును.

రాము.—[కోపము నభినయించి] ఇచటనుండి మీరిక వెళ్లుఁడు. [చింతించుచు] అయ్యో! నాశోకాగ్నిని నేనిపు డెట్లు చల్లార్తును. ఈయవనీజాత సీత పరమపాతివ్రత్యవిఖ్యాత యని తెలిసితిని గాని యంతటి దశ్చరిత యని కలనైనను దెలియనైతిని.

సీ. సీత సుశీలవిఖ్యాతగా నెఱిఁగితిఁ గాని దుశ్శీలగాఁ గనఁగనైతి,
అవనిజాత సుజాతయని తలంచితిఁగాని కలుషాత్మురాలని కనఁగనైతి,
పరమపతివ్రత పరిపూతచరితయం చెఱిఁగితి నిటులౌట నెఱుఁగనైతి,
పుణ్యవ్రతోపేత భూజాతయని మది నెఱిఁగితి దుష్టయం చెఱుఁగనైతి.

గీ. మానినీమణి సత్కులమణి యటంచు
నెఱిఁగితినిఁ గాని ఫణియని యెఱుఁగనైతి
పచ్చతములలోని వృశ్చిక ప్రాయయగుచు
నన్నుఁ గుట్టెనె యక్కటా నారి మారి.

[అనుచుఁ జింతించుచుఁ గూర్చుండి మరలలేచి] ఏమి ఇంతగ నే దూషించిన దెవరిని! నాసీత నా! సీత ముఖకాంతి విజిత సిత ఖద్యోత, జగజ్జనాపవాదభీత. పరిపూత గుణజాత. ఇట్టి భూజాతనా నేను నిందించినది........ఈనీచుల పలుకులు నేను నమ్మవచ్చునా? నమ్మఁగూడ దనుటకుఁ గారణము లేమియున్నవి? ఈగూఢచారికిని ఈదాసికిని సీతపైఁ గలద్వేషమేమి? గతానుగతికోలోకః యను లోకోక్తిరీతిగ నొకఁడూహాపైఁ బలికిన పలుకు రెండవవాఁడు సిద్ధాంతీకరించి పలుకుటయు, మూఁడవవాఁడు తానట్టి సమయమున సాక్షిగ నుంటిననుటయు, ఇటులనే వార్తలు లోకమెల్ల వ్యాపించుటయు, సహజము. అటులనే యీయపవాదము నూహాజనిత ఫలమ్ముగ నుండునా! [ఆలోచించి] దాసి మఱియొక చిత్రరేఖ నిదర్శనము పలికెను గదా? అది నిజమైనచో నీవార్త యపవాదవరములో రాదు కదా? ఆ నిదర్శనము నే నిపుడే కనిపెట్టెద. [అనుచు మెల్లఁగ నడుగులిడుచుఁ బానుపుఁజేరి తలకడక్రిందఁ గెలిడి చిత్రరేఖ వెలికిఁ దెచ్చి దీపము న దృష్టించి చూచి యుసురు విడిచి దానిని నేలపై విడిచి నిశ్చేతనుఁడై (యించుక కూర్చుండి మరల లేచి) ఇపు డేమి సేయుదును అయ్యో ఈకుటిలాలక యెంతటి కుటిల హృదయ! చక్కెరపూసిన విషఘుటిక. మేఁకవన్నె పులి. మందాకస్వన ఫణి. కుచ్చునగట్టిన చిచ్చు. పచ్చదము



లోని తేలు. తోడపై నిడుకొనిన పాము. దీని నిపుడేమి సేయుదును! చంపుదునా........స్త్రీనిఁ జంపు టెటుల? చంపకయున్న నీచం డాలురాలి ముఖముఁ జూచు టెటుల! [ఇంచుక యాలోచించి] సరి. ఇదియ సరియయిన మార్గము. అటు లొనరించెద......ఓరీ సేవకుఁ డెవఁడురా యచట [అనుచు నఱచును.]

సేవ.—స్వామీ! చిత్తము.

రామ.—నీవు వేగమునఁ బోయి లక్ష్మణునిఁ బిలిచికొని రమ్ము. ఒక వేళ నతఁడు నిద్రించియుండినను వెఱవక బోధించి నాయానతి యని పలికి పిలిచికొని రమ్ము. పొమ్ము.

సేవ.—చిత్తము. [నిష్క్రమించును.]

(అనుబంధము 10)

రాముఁడు.—ఈకలుషాత్మక ముఖదర్శనంబు నా కింకవలదు. తెఱవైచెద. ఇదియ దీనిముఖదర్శనంబునకుఁ దుది. విధిసంకల్ప మిటు లుండ నా సేయఁదగిన దేమున్నది!

సీ. స్వామి నీనామ సం - స్మరణంబె దివ్యమంత్రమ్ము నా కనుచు దంత్రములు పన్నె
రామ త్రిలోకాభిరామ నీ సేవయే హరిపూజ నాకనె దురితకర్మ,
ప్రాణప్రియా నిన్నుఁ బాయఁగాఁ జాలను నిక్కముంచని బలు టక్కులాడె,
నీసన్నిధానము నిజముగు సుఖమని తాటోటు మాటలఁ దటుకుటించె,

గీ. నచ్చికపు మాటలాడుచుఁ గుచ్చితములు
మెచ్చులాగునఁ బచరించె మెచ్చులాడి
యెలఁత లింతటివారని తెలియనైతి
దార దుశ్శీల యగునని దలఁపనైతి.

[అనుచుఁ జింతించుచు గూర్చుని యుండును.]

[లక్ష్మణుని ప్రవేశము.]

లక్ష్మణుఁడు.—ఏమి! ఇట్టి యకాలంబున నాయగ్రజుఁడు నన్నేల పిలిపించి యుండునో కదా. ఈమహానుభావుని ముఖభావంబుఁ జూడ

నిండువ్యసనంబున నున్నవాఁ డని తోఁచుచున్నది. భ్రూయుగ చలనము, నాసికాపుటము లెగరుటలు గనిన కోపావేశ వరవశుఁడయిన రీతిఁ జూపట్టెడు. కారణ మేమి యుండును? ఏఖలుని యాయుః ప్రమాణం బీగడియకు ముగియవచ్చెనో త్రిలోకత్రయం బొక్కపెట్టున గావలయునని తలఁచెనో తెలియఁజాలను. భయభక్తులతో సమీపించి నమస్కరించి పిలిపించిన కారణమును గుఱించి ప్రశ్నించెద. [అనుచు రాముని సరసకుఁబోయి.]

(అనుబంధము 11.)

అన్నా! నీయనుజన్ముఁడు లక్ష్మణుండు సాష్టాంగ దండప్రణామంబు లాచరించుచున్నవాఁడు.

రాముఁడు.—[దిగ్గున లేచి] తమ్ముఁడా! లక్ష్మణా. వచ్చితివా

లక్ష్మ.—అన్నా! గద్గదస్వరంబునఁ గన్నీరొలుకుచు మాటలాడుచున్నవాఁడవు; ఏల?

రాము.—హా! హా! ఏమని తెలుపుదును.

ఉ. ఆర్యకులంబునం దుదయమందిన వారలు సచ్చరిత్రులై
ఆర్యపథంబునన్నడచి యాశలనెల్ల యశంబు నించి రా
ద్యార్యులు తమ్ముఁగొల్వఁగను వాసియుఁ జెందిరి మున్ను లక్ష్మణా
ధైర్యవిభూషణా యిపుడు తప్పని కందానఁగూడెఁ గీర్తికిన్.

లక్ష్మణ.—అన్నా! చింతింపకు. కారణంబుఁ దెలుపుము.

రామ.—లక్ష్మణా! ఆవిషయంబు నోట నుడువఁజాల. అదిగో యచట పడిన చిత్రరేఖను జూడుము.

లక్ష్మణు.—[చిత్రరేఖ నెగాదిగఁ జూచి] అన్నా! ఈకపటమానీపటుతర హృదయ ధైర్యకవాటమును జీల్చి చింతకుఁ బథముఁ జూపినది. మనకుఁ గానివారి కుట్ర యిది యని నేఁ దలంచెద.



రాముఁడు.—ఇది సీత తలగడక్రింద నుండెను.

లక్ష్మణుఁడు.—అట్టిదా రుంచియుండవచ్చును.

రాముఁడు.—పట్టణమందెల్లెడల నావిషయమున నపనిందలు బలమైనవఁట. పరుఁ డెత్తికొనిపోయి యింట నుంచుకొనియున్న సీతను దెచ్చుకొని సిగ్గులేక మరల సంసారము చేయుచున్నాఁడ నని చాకలవారు కూడ నాడికొనుచున్నవారని గూఢచారి పలికెను.

లక్ష్మ.—నీచులమాటలా మనము నమ్మఁదగినవి.

రాముఁడు.—దీనావది నెకు భాగీరథీతీర వనవాటికల సంచరించు నపేక్ష గలదఁట.

లక్ష్మణ.—గర్భిణీపురంధ్రికి నెద్దియో విచిత్రాభీష్టం బుద్భవిల్లుట సహజమేను.

రాముఁడు.—పరుఁడు చెఱపట్టినదానినిఁ దెచ్చుకొని సాధ్వి యని యేలుచున్నవాఁడు రాముఁ డనుపలుకులు నా హృదయమునకు ములుకులై నాటి బాధించుచున్నవి.

లక్ష్మణుఁడు.—

సీ. సీత సద్గుణగణోపేత యంచని మున్ను బ్రహ్మాదిదేవతల్ పలుకలేదె,
సీత సుశీలవిఖ్యాత యామెనటంచు సప్తదిక్పాలకు లనఁగ లేదె,
సీత నీతిసమేత పూతదేహ యటంచు నగ్నిదేవుఁడు చాటి యాడలేదె,
సీత జగత్త్రయఖ్యాత యామెనటంచు నందఱు వినఁగ మీరాడలేదె.

గీ. ఇట్టి సద్గుణజాత పునీత సీత
ద్రోహియనుచును నిందగ దూఱనగునె?
అక్కటిక మెల్ల మాను చు నడవిఁ ద్రోయ
జెంతనగునె రఘూత్తము సాధి యగునె.

అన్నా! మావదిన పాతివ్రత్యమునకు బ్రహ్మరుద్రాదిదేవతలు మునులు దిక్పాలురు సాక్షులుగ నిలిచిరే? అగ్ని దేవుఁడు జానకి నిరపరాధ యని వక్కాణించెనే?

**రాముఁడు.**—నిజము, నిజము వానినెల్ల నే నెఱుంగుదును. అయినను పామరులమాటలు నిరాకరింపఁదగినవి కావు. అపకీర్తి వచ్చును. అపకీర్తిభాజనుఁడు మృతోపముఁడు. వానికి రౌరవనరకప్రాప్తి. కావున నే నీసడిపడఁజాల. సీత మోముఁ జూడఁజాల. నేఁ బ్రాణంబులతో నుండఁదలంతువేని రేపు ప్రాతఃకాలంబున నే సీతను దోడ్కొని భాగీరథీతీరారణ్యంబున వదలి రమ్ము. మాఱాడకుము. ఇది నాయానతి.

**లక్ష్మణు.**—అన్నా! నీయానతి శిరసావహింతును. ఇపుడు పోయి వచ్చెద. (నిష్క్రమించును)

**రాముఁడు.**—(సీతను జూచి.)

సీ. లావణ్యనిధి యీలలన నాలీలల కాలవాలంబని చేలనైతి,
సౌందర్యవారు యీసతి శుభవతి నాదు సుఖవసతిగ నెంచి సొంపుచెడితి,
సుగుణాకరము యీసుందరి నానోము ఫలమని తలఁచి నే బదుగునైతి,
రమణీలలామ యీరామ నాముద్దుల భామయంచని పిచ్చవాఁడనైతి.

గీ. ఏమియైనను గాని నేనింతపవన
మింతఁ జూచినయంత నె హృదయనీరుఁ
గరుణ రసముట్టిపడులాగు గలుగుఁగాన
జానకినిఁ జూడ నిలువఁగఁ జాల నేను.

ఈ జానకిబుణానుబంధము నాకీనాఁటికిఁ దీరెను. జానకీ! నీ ముఖదర్శనంబు నాకిదియె తుది. మహాయోగి మమకారము వదలునటుల నిందితురాలవగు నిన్ను నే నదలెద. కాకిముట్టిన హవిస్సును నే నుపయోగింపఁజాల. శరత్కాలంబున మహానది లినపంక మడు



గంటఁద్రొక్కి పావనతఁగాంచునటుల నిపుడు నేను నిన్ను వదలి పావనతఁగాంచెద, పోయెద.

(అనుబంధము 9.)

(నిష్క్రమము.)

## తృతీయాంకము.

మంథర - శూర్పణఖ.

**శూర్పణఖ.**—ఆలోచించుచు నడుగిడుచు) నే నాపట్టణము విడిచినప్పటినుండియును తెలియరాదాయెను. మంథర రాదాయెను. నిర్భయముగఁ బట్టణమందు నిలుతమన్నో యాకోఁతి మరల వచ్చి నామాయ గుత్తిరింగి చంపునోయని భయమగుచున్నది. ఈపాడు మంథరతో మాటలాడి వాయువేగమున వెళ్లి లంకాపురిఁ జేరి నావారిఁగూడి సంతసంబున నుండెద.

**మంథర.**—(ప్రవేశించి) ఏమి చుప్పనాకా! నన్నుఁ బిలిపించితివి!

**శూర్పణఖ.**—నేను నీతో సెలవంది వచ్చినపిదపఁ బట్టణమున విశేషము లేవి యయినను గలిగినవా?

**మంథర.**—మనపన్నిన పన్నాగము లెల్లను ఫలించినవి. ఆపాపాత్ముఁడు రాముఁడు జానకినిఁ బాసి దానిని నడవులఁ ద్రోసెను. ఇపుడు వెక్కివెక్కి యేడ్చుచున్నవాఁడు. అన్న మొల్లఁడు. నిదుర యొల్లఁడు. రాజ్య మేలనొల్లఁడు. అప్తుల పలుకులు వినవొల్లఁడు. చీకటి గదిలోఁ బడి పొరలుచున్నవాఁడు. వాని దురవస్థఁ గని నేను సంతసించుచున్నాను.

శూర్పణఖ.—నావిషయమును గుఱించి యేమయినను జరిగెనా!

మంథర.—జరిగెను. సీతవిషయమున రాములతోఁ జెడువార్తఁ దెలిపినదాసి యెవతె యని భరతుఁడు విచారించుచున్నవాఁడు. ఏదానిని విచారించినను తానుగాదు తానుగాదని పలుకుచున్నవారు. ఎవతెయో రక్కసి యీమాయలు పన్నినదని నిర్ధరించి దానినిఁ బట్టుటకు నాంజనేయుఁ డనుకోఁతికి సమాచారంబు బంపినారు విభీషణునకు సైతమీవార్తఁ దెలుపుదురఁట.

శూర్పణఖ.—అమ్మా! మంథరా. నా కేమో భయ మగుచున్నది. ఆకోఁతి యిపుడే నాయెదుట నిలిచినట్లున్నది. నాలంకకు నేఁ బరువిడెద (నిష్క్రమించును.)

మంథర.—ఇపుడు నాకడుపుమంట చల్లారెను. హాయిగ నిదురించెద. పోయెద.

(నిష్క్రమము.)

తురీయరంగము.

భాగీరథీ తీరారణ్యము.

సీత లక్ష్మణుఁడు. వాల్మీకి శిష్యులు.

అనుబంధము 18.

సీత.—[అడుగిడుచు లక్ష్మణునిఁ జూచి] లక్ష్మణా! చూచితివా మన దారిలో నెన్ని యపశకునము లాయెను.

ఉ. నక్కలుకూయసాగె నుఱినాలిమెకంబులు దారినడ్డమై
చిక్కులుగూడె ముంటలవె పిక్కటిలెన్ వనచుట్టు సర్వరా
శొక్కను పుట్ట; గ్రద్దలివె చేరెను కేతనమందుఁ జూడుమా
నిక్కముగాను భీతి యెదనెక్కెనుగారణ మేమొ లక్ష్మణా?



లక్ష్మణా! నా కేమో కడుభయ మయ్యెడు. దారిలో నగపడిన యపశకునములకుఁ దోడుగ నీవు మౌనము వహించి మునిపల్లెలు వదలి ఘోరారణ్యములు సంచరింపసాగితివి ప్రశ్నించినపు డెల్లను గన్నీరు గార్చెదవు. కారణమేమి? ఈ దుశ్శకునములు చూచినతఱి నుండి నాప్రాణప్రియునకు రామునకు నీకును నాయత్తగారికి మిగత బాంధవులకు నాప్తకోటికి మే లొసఁగుమని దైవమునుగూర్చి మనమున నమస్కరించుచున్నాను.

లక్ష్మణుఁడు.—[కన్నీరుఁ గార్చుచు.]

ఉ. ఏమని తెల్పుదున్ వదినె యేర్చు మనంబును దుఃఖ ముక్కటా
భూమివిభుండు సోదరుఁడు పూనుచు నిన్గొనిపోయి కానలో
బ్రేమను వీడి త్రోయుమని భీకరవృత్తిని నానతిచ్చె నా
రాముల యాజ్ఞ మీఱఁగను రాదు గదా మన కెల్ల కాలమున్.

[అనుచుఁ దలవంచుకొని నిలుచును.]

సీత.—[భీతిలి] ఏమీ! ఏమీ! లక్ష్మణా! ఏమి పలికితివి? నాప్రాణప్రియుని యాజ్ఞ నీవు చక్కఁగ వినియుండవు. భాగీరథీతీరమునందు గల మునుల యాశ్రమములం జూచి మునికన్యకలతో ముచ్చటలాడి యొకటిరెండు దినములలో వత్తునని నాప్రియునిఁ గోరితిని. అటులనే పంపెదనని పలికియుండెను.

లక్ష్మణుఁడు.—నిజము తల్లీ నిజము. నిన్నటి రేయి జరిగిన విశేషములు నీకుఁ దెలియవు కాఁబోలు.

సీత.—[వెఱఁగంది] అన్నా లక్ష్మణా! అవి యెవ్వి?

లక్ష్మ.—వదినా! ఈ పాపిని నట్టిసమాచారం బెటు తెల్పుదు. పురియందుఁగల నీచులు కొందఱు రావణుఁ డెత్తుకొనిపోయి యింటిలో నుంచుకొనిన సీతను సిగ్గులేక రాముఁడు మరలఁ దెచ్చి

కొని యేలుచున్నాఁడని పలుకుచున్నవా రఁట. ఆసమాచారంబు గూఢచారి మనరామునకుఁ దెల్పెనఁట. అకారణంబున నపనిందకు భీతిలి యిట్టి యాజ్ఞ నిడెనఁట. క్షుల్లకజనుల వాక్భల్లమ్ము లెదనాటి యిట్టి బెట్టిదంపు నాజ్ఞ యిడినాఁడు

సీత.—లక్ష్మణా! ఎంతటినీచులయిన నిట్టి నింద లారోపింతురా! నా ప్రాణప్రియుఁ డట్టిమాటలు నమ్మునా!

సీ. వినరో మాకట్టింటిజనులు నాజననాది
వృత్తాంతమెల్లను వీనులలర?
వినరో యా యనసూయ జనయిత్రి మొదలగు
సతులు నన్ను నుతించు సరణిఁ దాము?
వినరో నే లంకలో వీతిహోత్రజ్వాల
దుమికి వెల్వడిన చందమును దాము?
వినరో బ్రహ్మాదులు వీరపతివ్రతా
మణి సీత యని యాడుమాటఁ దాము?

గీ. వినియుఁ గనియును గానని జనులునింద
మోపినను రాముఁ డది వినమోపెనెటుల?
నీచు లను నట్టి మాటలు నిజముగాను
నమ్మెనెట్టుల నా ప్రాణనాథుఁ డకట?

లక్ష్మణా! దుశ్చింతలగు నీచులమాటలు నిజమని నా ప్రాణప్రియుఁడు నన్ను విడనాడియుండఁడు. నా ప్రాణప్రియుఁడు శాంతమూర్తి; కటికడెందమువాఁడు కాఁడు.

లక్ష్మణ.—తల్లీ! జనులనిందకుఁ జేరికగ మఱియొక నిదర్శనముఁ గన్నులారఁ గనినాఁడు.

సీత.—అది యేమి!



లక్ష్మణ.—తల్లీ! రావణునిఁ గూడి యేకశయ్యపై నీవు పరుండినట్టి యొక చిత్రరేఖ నీతలగడక్రింద నుండెనఁట. నీదాసి పలుమాఱొంటరిగ దానిఁ జూచుచు దుఃఖించుచుండువని పలికెనఁట.

సీత.—(రెండుచెవులు మూసికొని) రామ రామ (అనుచు నేలపైఁ బడి) లక్ష్మణా ఆపటము నీవు చూచితివా?

లక్ష్మణ.—తల్లీ! నేనును దానినిఁ జూచినాను. నిజము.

సీత.—(నిట్టూర్పు సారించుచు) లక్ష్మణా! పిడుగుకంటెను గఠినమగు నీమాటలువిని నే నింకను బ్రదికియున్నదాననా. "పాపీ చిరాయుః" అను రీతి మొండిబండఁగ నింక నెన్నిదినములు బ్రతుకనున్నదాననో దెలియదు. తండ్రీ! పూర్వజన్మంబున సుఖముగ నుండునట్టి దంపతుల నెవరిని నే నెడఁబాయఁ జేసితినో కదా! ఇపు డిట్టి దురవస్థ నాకుఁ బ్రాప్తించెను. అయ్యో! ఆపాడు చిత్రపట మొకదినమైనను గన్నులఁ జూచి నే నెఱుఁగనే! ఇది యేదురాత్మురాలగు దాసి కృత్యమో! ఎటులయినను రాము నాజ్ఞ దాఁట దగినది కాదు కదా! ఇఁక రామునిఁ జూచు భాగ్యము నాకు లేదాయెఁగా! ఆరాముని మంగళధాముని దివ్యశ్రీపాదపూజఁ జేయు నోము నోమనైతినిగా! ఆమహానుభావుని పదకమల సలిలంబు తీర్థంబుగఁ గొని పావనతఁ గాంచు ఫలంబు నాకు లేదాయెఁగా! నా జననాదినుండి మరణపర్యంతంబుఁ గానన నివాసమే గతి యని బ్రహ్మ నానొసట లిఖించియుండ నేనెంత తపించిననేమి! ఎవరి నెంతదూఱిన నేమి? అన్నా! లక్ష్మణా! నీ సేయఁదగిన కార్యం బయినది. రామునాజ్ఞ నెఱవేర్చితివి. ఇఁక నీవు పురికి వెడలి సౌఖ్యమున నుండుము, అన్నా! లక్ష్మణా!

సీ. ప్రాణనాథుని పాదపద్మములకు మ్రొక్కి వేడితినని విన్నవింపుమన్న,
అత్తల కుత్తరి ననురక్తి నమియించి తలఁచె సీత యటంచుఁ బలుకుమన్న,
భరతశత్రుఘ్నులఁ గరుణించి జానకి దీవించె నని నీవు దెలుపుమన్న,
అలపురోహిత బాంధవాళికి నానమస్కారములఁ నీవు సలుపుమన్న,

గీ. తోడికోడండ్రులకును సంతోషమొదవ
నేసుఖముడిగెనటంచని చెప్పుమన్న
అన్నమాటలు జవదాటకన్న నీవు
పోయిరావన్న నేమంబు పొందుమన్న.

లక్ష్మణా! పోయిరమ్ము.

లక్ష్మణుఁడు.—

సీ. ఘనకాననంలో నిన్ను నేకాకిగాఁ జేసి మన యయోధ్యకు నెట్లు మరలుదమ్మ?
పురిజనుల్ ననుఁగని పుణ్యహీనుఁడటంచు బల్కిన నే నెట్లు బ్రదుకుదమ్మ?
మాతలు ననుఁగని సీతఁ జూపకయున్న శపింతురు నన నెట్లు సైతునమ్మ?
జనకుండు ననుఁగని జానకి యెదియని యడిగిన నే నేమి యందునమ్మ?

గీ. వలదు పురి నాకు నలదింద్రపదవి మాత
నీపదంబులు గొలుచుచు నిలుతునమ్మ
ఎగతదోషను వదినె నీ విపినమందు
విడిచి పోఁగఁజాలను వినవె తల్లి.

సీత.—అన్నా! లక్ష్మణా! నీవు నా ప్రాణకాంతునిఁ జేరి నామాటలుగ విన్నవింపఁదగినపలుకులు గొన్ని తెలిపెద.

లక్ష్మణుఁడు.—తల్లీ! అవి యెవ్వి?

సీత.—దేవదేవుఁడవగు శ్రీరామా! నిన్ను ధ్యానించినవారికి పరమేశ్వర పదవియుఁ బూజించినవారికి బ్రహ్మపదవియు రక్షింపుమని వేడుకొనినవారికి నాచంద్రార్కాయువు గలిగి బ్రదుకు పదవియు వచ్చుచుండ నిన్నెల్లకాల మెడఁబాయక నీకు నర్ధాంగినైన నాకు నీ సామీప్య పదవియైనను దొరకదాయెను. నేనెంతటి పాతకినో



తెలియదు. సాక్షి సముద్రముఁ జొచ్చినను మోఁకాలిబంటి నీరను నుడి సార్థకమాయె. భువిని నేఁ బుట్టి నీచెట్టఁబట్టి నీకు దుష్కీర్తిఁ దెచ్చితిని. అటవినుండనీ, ఎచ్చటనుండనీ, నీపదధ్యానంబు సేయుచు మనెద. కాఱడవులఁ బడి మనియెద. దురాత్ముల మాటలు నిజమని నమ్మి మనోరోగమున నీవు కుమిలింపకు. లమాటలు నమ్మకు. నిజము నిలుకడమీఁదఁ దెలియును. ఈమాటలు నామాటలుగఁ దెలుపుము. అన్నా లక్ష్మణా! సురక్షితముగం బోయిరమ్ము. అడలకుము.

లక్ష్మణుఁడు:—(సీతకు నమస్కరించి) తల్లీ!

సీ. తలిరులఁబోలెడు తల్లి నీపదములు కంటకకలిత మీ కాననంబు,
అతికోమలతఁ బూను లత నీదు దేహంబు వితతాతపాతప్త విపినమిదియు,
మెత్తనిమెత్తల మెచ్చదు నీమేను కర్కశపాషాణగహన మిదియు,
పిచ్చుక లఱచిన జిచ్చవడెదు నీవు భీషణమృగనాద భీష్మమిదియు,

గీ. కటకటా యిట్టి కఠినత లెటుల నీవు
నైఁచుదానవొ కాంతారశరణవగుచు
తల్లిరో నిన్ను విడనాడి తరలిపోవఁ
గాలు సేతులు నాడవు కదల నేను.

తల్లీ! రాము నానతి శిరసావహించి సేయునది నాపని. తల్లీ! నీవు మహాపతివ్రతామణివి. నీ శీలసంపద పురంధ్రీమణులకు శిరోభూషణము. అయినను నాయన్న నిన్ను విడనాడెనని మది నడలక నీపతిని దూఱక నీగ్రహచారమును నిందించుచు నిచట నెచటనైన నుండు మునిపల్లెలం జేరి రామధ్యానపరాయణవై బ్రదుకుము. నాకు సెలవిమ్ము. సాష్టాంగప్రణామంబు లాచరించెద.

సీత:—(గద్గదస్వరమున) అన్నా పోయిరమ్ము.

లక్ష్మణుఁడు:—

సీ॥ కరులార భూరికేసరులార కావరే సీతను జగదేకమాత నిందు,
యతులార విపినదేవతలార కావరే సీతను జగదేకమాత నిందు,
తరులార యోతరుచరులార కావరే సీతను జగదేకమాత నిందు.
నరవరులార కిన్నరులార కావరే సీతను జగదేకమాత నిందు.

దశదిశాధిపులార నిద్దంపుదయను
కావరేసీత సద్గుణఖ్యాత నిందు
సూర్యచంద్రాదులార యీశుద్ధచరిత
సీతమాతను బ్రోవరె నేడు మొసఁగి.

(లక్ష్మణుఁడు నిష్క్రమించును.)

**సీత:—** (14 అనుబంధము)

ప్రాణనాథా, మోహనాంగా, సీతామనోహరా, నిన్నెడఁబాసి నే నెటు లీయరణ్యమున మనుదు. నాథా! మిథిలకువచ్చి శివధనుస్సు విఱిచి నన్ను బెండ్లియాడినది నాకీకాననవాసంబు గల్పించుటకా! అకటినాత్ముఁడు రావణుఁడు నన్ను బలాత్కరించి కొనిపోయినపుడు కపిసేనం గూడి సముద్రమునకు సేతువు కట్టి రాక్షససంహారం బొనర్చి నను దెచ్చినది మరల నన్ను కాఱడవులఁ ద్రోసి కారాకుమేసవు ప స్థితికిఁ దెచ్చుటకా? అహా. అలనాఁడు పదునాలుగేండ్లు కానన నివాసం బొనర్చి దానవులమధ్యనుండిన నేను గహనమున మనియుంటకు వలవడినదాననని తెలిసితివా? అయ్యో పొరఁబడితివి. నీధైర్య శౌర్యపరాక్రమసాహసంబులు నే నెఱింగిన దానను కావున నీ వెటులైన రావణసంహారం బొనర్చి నన్నుఁ గొనిపోదువనియె యాశ బ్రదికించెనుగాని వేఱొకటి కాదు. ఇప్పుడట్టి యాశలు నాకు లేవాయె! ఇఁక నేఁ బ్రదికి యేమి ప్రయోజనము? బలాత్కారమరణమునకు నొడిగట్టుదమన్నన్నో నాకీ పాడుగర్భ మొకటి బాధించుచున్నది. అయ్యో. బహుజన్మార్జిత పాపరాశియంతయు మొత్తమై యాకారముఁ



గొని స్త్రీరూపంబున నన్ను గల్పించినది. అయ్యో! దశదిశల తన యశంబు నించి ప్రసిద్ధిఁగసిన మిథిలాధినాథుని కూర్మిపుత్రినై సూర్య వంశభూషణమగు దశరథునకుఁ గోడలై లోకాధీశుఁడగు శ్రీరాముని సతినైన నాకు నడవుల నిడుమం బడెనాయెఁగా? విధికృతంబునకు నెవరిని దూషించి యేమి ప్రయోజనము?

(15 అనుబంధము)

ఉ. హా రఘురామ రాక్షసకులాంతక రాఘవ నీకు నెప్పుడే
నేరము సేయ నేలయిటు నిర్దయతన్ ననుఁ బాసి కానలోఁ
"ఘోరతఁద్రోయుమా" యనెడుకోపముఁ బూనితి వైననామదిన్
సారెకు నీదురూపమును చారుతరంబుగ నిల్పికొల్చెదన్.

అనుచు నేడ్చుచుండును.)

(వాల్మీకి శిష్యులం గూడి యూపస్తంభ కుశ దర్భలకై వెదకుచుఁ దనశిష్యులకు బాలరామాయణశ్లోకంబులు చెప్పుచు వచ్చును.)

**అందఱు:—** శ్లో. శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం।
సీతాపతిం రఘుకులాన్వయరత్నదీపం।
ఆజానుబాహు మరవిందదళాయతాక్షం।
రామం నిశాచరవినాశకరం నమామి॥

(అనుచు శిష్యులందఱు నమస్కరింతురు.)

**వాల్మీకి:—** వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామండపే।
మధ్యేపుష్పకమాసనే మణిమయే వీరాసనే సుస్థితం।
అగ్రేవాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం।
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామంభజే శ్యామలం॥

**ఓరీ. గర్గా:—** ఆంజనేయ ప్రార్థనాశ్లోకము పఠింపుము.

**గర్గ:—** అంజనానందనం వీరం - జానకీ శోకనాశనం।
కపీశమక్షహంతారం - వందే లంకాభయంకరం॥

రాఘవశిష్యు:—అంఘ్రీకృతమార్తాండం గోష్పదీకృతసాగరం ।
తృణీకృతదశగ్రీవం అంజనేయం నమామ్యహం ॥

మాధవశిష్యు:—యత్రయత్ర రఘునాథకీర్తనం
తత్రతత్ర కృతమస్తకాంజలిం
బాష్పవారి పరిపూర్ణలోచనం
మారుతిం నమత రాక్షసాంతకం ॥

వాల్మీకి:—శిష్యులారా; రాముని పరాక్రమవైభవమును, ఆమహాను భావుని ముఖ్యభక్తుని సాహసవిభవమును, మీరెల్లకాలములందు నీశ్లోకములను పఠించు చుండుఁడి.

సీత:—(అరణ్యములో నొకభాగమునందు.)

సీ. రామపరంధామ రవికులార్ణవసోమ రామరామా రమారామరార,
నిర్వికల్పారార నిర్వికారారార నీలమేఘశ్యామ నీవురార,
సగుణనిర్గుణరార సద్గుణాకర రార రా భవదుఃఖవిరామ రార,
సర్వలోకాధార సత్యనిత్యవిహార రామరక్షోగణభీమ రార,

గీ. రారరామా త్రిలోకాభిరామ విజిత
రామ శ్రీరామ రఘురామ రామచంద్ర
జానకీరామ నృపకుల సార్వభౌమ
విభవసుత్రామ త్రైలోక్య విమలనామ.

వాల్మీకి:—(మఱియొక భాగమున.)

(గర్గునిఁ జూచి గర్గా! దూరమున నెవతెయో స్త్రీ దుఃఖమున గద్గదస్వరమున రామనామధ్యానము సేయు చున్నది. చూచి రమ్ము.

గర్గ:—స్వామీ! యటులొనరించెద. (అనుచు నెలుఁగువచ్చిన జాడఁ బట్టుకొని పోవును.)

సీత:—ఉ. రారఘురామ రాక్షసవిరామ విశాలయశోభిరామ
రారవివంశధామ మధురాక్షరపావననామ రాకదే
రారణరంగభీమ సురరాజితసుందరకామ ప్రోవఁగా
రారత్రిలోకధామ సతరక్షణ నీకిది భూరి భారమా.



గర్గుఁడు:—ఎగాదిగఁ జూచి తలయూఁచి ఆహా; ఏమి యుచ్చైరువు! నేను వేగమునఁ బోయి యీయమ యేఁడుది. కన్నీరొలుకుచు దుఃఖించుచున్న దని నాగురువుల వారికిఁ దెలిపెద. (పోవును.)

వాల్మీకి:—ఆహా! ఆ స్త్రీ రామనామధ్యానమును విని మేను పుల కరించు చున్నది.

గర్గుఁడు:—[వచ్చి] స్వామీ! పోయి చూచి తిరిగి వచ్చితిని.

వాల్మీకి:—ఎవ రామె.

గర్గు:—ఆమె యొక స్త్రీ

వాల్మీకి:—ఓరీ, మూర్ఖా! ఆమె స్త్రీ యనునది కంఠస్వరము పైనే గుర్తించితిని; నీవచటికిఁ బోయి యామె యెవ్వరైనది తెలిసికొని రమ్మని పంపితిని.

గర్గ:—స్వామీ! చూచిరమ్మని పలికితిరి; చూచి వచ్చితిని. ఆమె యెవతెయో నేను బల్కరింపలేను.

వాల్మీకి:—మానవస్త్రీయేనా, యువతియా.

గర్గ:—నాకేమి తెలియును!

కం. రతియో, వనదేవతయో
సతియో భారతియొ, సారసాక్షుయువతియో,
ధృతిఁజెడి యేడ్చెడు, రాముఁడె
గతియని దైవంబటంచుఁ గానగనేరన్.

వాల్మీకి:—[తలయూఁచి] నేనే యచటికిఁ బోయి విచారించెద. [పోయి సీతను జూచి.]

అమ్మా! నీవెవరు ఒంటరిగ నీ కాఱడవి నుండుటకుఁ గారణం బేమి! నిన్నెచటనో చూచిన ట్లున్నది. బెదరి బెండుపాటినరీతి నగ

## పంచమరంగము.

ఆశ్రమము. తొట్ల పెట్టుట.

బాలింతరాలగు సీత. ముత్తైదువులు మునికన్యలు. వాల్మీకి శిష్యులు.

సీత:—తొట్లను ఊఁచుచుండుట.

ముత్తైదువులు:—లాలి, జోలపాటలు పాడుట.

ఋషికుమారులు:—మంత్రములతో స్వస్తివాచనములు చెప్పుట.

వాల్మీకి:—వేదఋక్కు చెప్పి ఆశీర్వదించుట.

వృద్ధలగు ముత్తైదువలు:—లవ కుశులని పేరిడుట.

సంగీతము మొదలగు నుత్సవములు.

## ఆఱవరంగము.

అయోధ్య. రాజమందిరము.

రాముఁడు:—

సీ. వరసుగుణోదార నిరుపమాలంకార కరుణార్ణవవిహార దురితదూర,
కంబుకంధరవక్త్రబింబఫలాధర లీలావతార వినీలచికుర,
సతతసన్మార్గసంచార నీతివిచార లలితాంగలావణ్య జలవిహార,
పతిపదధ్యానైకపరత భాసిలు దార మంజులవాక్సుధామధురసార,

గీ. వితతసౌజన్యకలిత పవిత్రచరిత
మైథిలీరాణ్మహావనీ మహితజాత,
స్ఫీతకరుణాంతరంగసమేత ఖ్యాత
గీతగుణగణసంజాత పూతసీత.



హా, హా, ఇట్టిసీతను విడనాడి క్రూరారణ్యమునఁ ద్రోసితినే; నాప్రాణనాయిక జానకి నన్నుఁ దలంచుచుఁ గటికవానికంటెను గఠినాత్ముఁడు నే నని యెంతగ దూషించెనో! ఎంతగఁ దపించెనో! ఆ ఘోరాటవిని గ్రూరమృగావళికిఁ జిక్కి స్రుక్కెనో? కటికకానలోఁ బడి దిక్కుమాలినదయి చిక్కెనో? అలనాఁ డాయరణ్యంబున నొంటరిగ నుండునపుడు కులదూషకుఁడు ఖలుఁడు దశగ్రీవుఁడు బలాత్కరించి యెత్తుకొని పోయిన విధమున దీనతచే దఃఖపడు జానకిని నేఖలుఁ డెత్తికొని పోయెనో! నాఁడు నాప్రాణప్రియ విగతాపవాదలక్ష్యభూతయైయుండెను, కాన వెదకించి యునికిఁ దెలిసి యనిలో రాక్షసునిఁ జంపి మరలఁ దెచ్చికొంటిని. ఇపుడో నే నైయపవాదమునకు భయపడి త్యజించి యడవిం బడఁద్రోయించిన జడజాయతలోచనను మరల నన్వేషించు టెటుల? అటు వెదకించి పిలిపించినచో జనులు నన్నుఁ బలువిధముల దూషింపరా? కాముకుఁడు చపలచిత్తుఁడు రాముఁడని నన్నాడికొనరా? ఏమీ, సీతను దలంచుకొని నేఁడింతఁగ నేను దుఃఖించు చున్నాను. నిజముగ సీత దూషితయయ్యోనేని నామానసమింతఁగఁ గళవళపడుచుండెనా? దూషిత కాదేని నపవాదంబునకు మూలకారణమేమి యుండును. అపవాదమపవాదమనియే యెంచితినిబో యా చిత్రరేఖను జూచుచు సీత దుఃఖించుచుండ నేల? అదియును మృష యని తలంచితినిఁ బో, సీత తనతలక్రింద నాచిత్రరేఖ నుంచికొని పరుండ నేల? ఏవతెయైన దుర్మార్గురాలాపని యొనర్చి యుండునా? అయ్యో, నాప్రాణప్రియకు శత్రువులే లేరు కదా? అందఱకు నల్లారుముద్దుగ నుండునది కదా నాజానకి? నాకు శత్రువగు మంథరకుసైతము సీతపైఁ బ్రేమయే? ఆ చిత్రరేఖ యెటులవచ్చి యుండును? [అనుచు నాలోచించుచు] ...... ఏమీ, దూరంబున నతి భీకరత వచ్చుఛాయావిగ్రహ మేమియుండును! క్రౌర్యమంతయు

నాకాకాశంబు వహించి నాపైఁ బడు రీతిగ వచ్చుచున్నదియే ! హా, హా, తల లెన్నియున్నవి ! చేతు లెన్నియున్నవి ! దశగ్రీవుఁడుండునా ! వాఁడు నాచేఁ జంపఁబడిన వాఁడు నేఁడిట్లు ప్రాణసహితుఁడై యుండును ! వాఁ డేమయినను భూతమయి నను వేధింప వచ్చియుండునా ! నాకేమీ వాని యాకారమును గని భయమయ్యెడు. [కనుచు నిలిచి] ఏమీ దశరథాత్మజుఁడగు నాకీభీతి యెచటనుండి వచ్చెను ! ఇదియుఁ జిత్రముగ నున్నది. ఏమీ, ఆయాకారము కేలు సాఁచి నన్ను వదల నని తెలుపుబాగుప నభినయించు చున్నదియే. దీనికిఁ గారణంబుఁ దెలియక యున్నాను [ఆలోచించు చుండును.]

[నారదుని ప్రవేశము.]

నారద:—

> నతపరిపోషణ పతితవిమోక్షణ నుతగుణభూషణ రాఘవా
> హితకలభాషణ యతిజనరక్షణ దితికులశోషణ రాఘవా
> గతజనదూషణ శతరణభీషణ యతిశుభదేషణ రాఘవా
> హతఖరదూషణ శ్రితజనతోషణ శతముఖపోషణ రాఘవా.

రామ:—నారదమునీంద్రా ! రఘురాముఁ డభివందనము లాచరించెడు.

నార:—ఆయురారోగ్యాభివృద్ధిరస్తు.

రామ:—మునివంశోత్తమా ! శుభదాయకంబగు తమరాకకుఁ గారణం బేమి ?

నార:—ఇనకులవంశాగ్రణీ !

ఉ. మానితమైనభానుకుల మాత్రికమైజనియించి తండ్రియా
జ్ఞానుగతిన్ మునీంద్రు మఖశాలను గాచు నెపంబుఁబూనుచున్
దానవకోటిఁజంపి మునిదార నహల్యను ముక్తఁజేసి - శ్రీ
జానకిజానిగా వెలయు సౌఖ్యనిధిన్ నినుఁ గానవచ్చితిన్.

రామచంద్రా, ఇట్టిసౌఖ్యాంబునిధిలో నోలలాడు నీదర్శనంబు నకై విచ్చేసితిని గాని వేఱేమి కారణంబును లేదు.



రామ:—మునీంద్రా !

(అనుబంధము 17.)

అపనిందలకు గుఱియై చంద్రలపనయగు సీతను కానఁ ద్రోయించిన నాకు సంతస మెచ్చట నుండి వచ్చును ?

నార:—ఏమీ, పవిత్రయగు భూజాతపై నపనిందలు బుట్టెనా ? కాల మహిమకు నెవరేమి సేయఁగలరు ? నినుఁ బోలు ధీరోదాత్తుఁ డిట్టి సంకటములకు లక్ష్యభూతుఁడై దుఃఖించునపు డితర మానవుల ననసేల ?

రామ:—మునిసత్తమా ! జానకీ వియోగము నా కనవరత మనల సంయోగమై మనంబును జింత యను చితిలో గాల్చుచుండ వేఱొక భీతి నాహృదయంబుఁ జొచ్చి పీడించుచున్నది.

నార:—రఘూత్తమా ! అది యేమి ?

రామ:—జ్ఞానావిశారదా, నారదా ! సదాకాలంబు నన్ను వదలక యొకవికారాకారంబు ఛాయారూపమున వెంబడించుచు వివిధ రూపంబులు బూని నాకట్టెదుట నిలచి నిన్ను వదలనని పంతం బులు పలుకువారింబలె నభినయించుచు బాధపెట్టుచున్నది. ఏమి యుండును ?

నార:—(ఆలోచన నభినయించి.)

> బ్రహ్మకులంబునఁ బ్రాభవముంది
> బ్రాహ్మణవిద్యలఁ బాతిమొనర్చి
> వేదవిదుండయి వెలైడువాఁడు
> చెందురశక్తిని ఓంచినవాఁడు
> బ్రహ్మయెతాతగ భాసిలువాఁడు
> బ్రహ్మవరంబునఁ బ్రబలినవాఁడు

కావవకుండయి సౌమ్యముంబాసి
తాపసవర్యులఁ దార్చెనువాఁడు
వానివధించిన వాఁడవు కాన
నానెను బ్రాహ్మణ హత్యయు నిన్ను.

నార.—రామభద్రా! నీ వా రావణునిఁ జంపిన బ్రహ్మహత్యాపాతకము నిన్నంటి బాధించు చున్నది.

రాము.—మునికులోత్తమా! నన్నంటిన బ్రహ్మహత్యాపాతకము నే నెట్లు వదలించు కొనఁగలను.

నార.—రఘుకులాగ్రణీ! అశ్వమేధం బొనర్చితివేని నీపాపంబు పటాపంచలయి పోవును. తొల్లి యిళుఁడను రాజీ హయమేధంబొనర్చి గతదోషుఁడై సర్వసౌభాగ్యము లందెను.

రామ.—యతిరాజహంసా! అశ్వమేధం బొనర్ప లక్షణాన్విత హయంబు దొరకు టెటుల?

నార.—దాశరథీ! రావణుని సోదరియగు కుంభీనసపుత్రుఁడు లవణాసురుఁడు లోకకంటకుఁడై యున్నవాఁడు. వానిసరస హయమేధార్హములగు హయము లున్నవి. వానిం జంపి యశ్వంబుఁ దేనగును.

రాము.—మునిసత్తమా! తమదర్శనంబునఁ గృతార్థుఁడ నైతిని. తమ యానతిని శిరస్సావహించి చేసెద. అయినను హయమేధం బొనర్చు గృహస్థుఁడు భార్యాసహితుఁడై యుండవలయును గదా! నా ప్రాణప్రియను జనాపవాదభీతిని వదలితి. భార్యావిహీనుఁడు యాగం బొనర్చు టెటుల?

(అనుబంధము 18.)

నారద.—రఘుకులోత్తమా! దరిద్రుని మాడ్కి నేల పలికెదవు! రాజసర్వోత్తముఁడవై సర్వసౌభాగ్యంబు లనుభవించు నినుఁ బోలు చారుతర సుందరాకారునకు నే రాజు తనసుతను నియ్య నిరాక



రించును? కావున నీవు మఱియొక సుందరాంగినిఁ బెండ్లియాడి తురగమేధం బొనర్చి సుఖముగ నుండ నోపు.

రాము.—నీతివిశారదా! నారదా! నే నేకపత్నీవ్రతుఁడ నన విషయము మీ రెఱుంగని విషయమా? నేఁ బట్టిన దారైకవ్రతదీక్ష మాన నామన మొప్పదు గదా?

నార.—రఘురామా! మఱియొకవిధమున యాగ మొనర్ప నగును.

రాము.—అది యెటుల?

నార.—రామా! బంగారు జానకినిఁ జారుతరంబుగఁ జేయించి దానిని సరసనుంచి కొనుము.

రాము.—మహానుభావా! తమదివ్యాలోచనచే నద్దిష్టకార్యసిద్ధి యగు నేని నటులొనరించెద.

నార.—రామచంద్రా! దానికి సందియంబు లేదు. నేను బోయి వచ్చెద.

రాము.—మునీంద్రా, వందనంబు లొనర్చెద.

(నిష్క్రమణము.)

## ఏడవరంగము.

రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు. వసిష్ఠ వామదేవాదిఋషులు.
అశ్వపూజ.

వసిష్ఠులు.—(మంత్రములతో హయ చరణములు గడిగించి పూజ చేయించును.) రామచంద్రా! పూజ సంపూర్ణమాయెను. ఇఁక నీ పూజ్యమగు గుఱ్ఱము ముఖమున హేమనిర్మితఫలకంబు బంధించి నీ బిరుదు పద్యము లిఖించి దిగ్దేశంబులు జయింప శక్తిఁగల

వీరాధివీరుని వెంటఁ బంపనగును. ఏశూరుఁడు దీనినిఁ బట్టి బంధించునో వానిఁ గెలిచి కప్పముఁ గొని రాఁదగును

రామ.— మహానుభావా! సకలము సిద్ధముగ నున్నది. ఇదిగో హేమ ఫలకము. ఇందు వ్రాయఁదగిన బిరుదులు తమరే లిఖింపఁదగును.

వసిష్ఠుఁడు.— అటులనే కానిమ్ము. నీపరాక్రమము నీవే పొగడుకొనుట భావ్యము కాదు. నేను వ్రాసెద (హేమఫలకము దీసికొని వ్రాసి చదువును.

మ. హయమేధాంచితమైన యశ్వమిది ధీరాగ్రేసరుం డర్కా
న్వయవారాన్నిధిపూర్ణచంద్రుఁ డఖిలానందైకశీలుండు - ని
శ్చయదార్ఢ్యైకసునీతివర్తనుఁడు కౌసల్యాతనూజుండు - ని
ర్భయుఁడై బంపెఁ దురంగముం భువిని గెల్వన్ జాలు సైన్యాళితోన్.

రామచంద్రా! ఈ హేమఫలకమును హయరాజముఖంబునఁ గట్టుము.

రామ.— మహాప్రసాదము. (అందికొని గుఱ్ఱము ముఖముపైఁ గట్టును.)

వసిష్ఠుఁడు — రామభద్రా! దీని వెంబడింప శూరాగ్రేసరులను బంపుము.

రామ.— (శత్రుఘ్నునిఁ జూచి) అనుజా! అసదృశమాయాబల విక్రముఁడగు లవణాసురుని సంహరించి లోకమును రక్షించిన ధీరునకీ తురంగ రక్షణ మొకవిశేషము కాదు. కావున నీ వీ హయమును వెంబడించి దీనిని బంధించిన వీరులతోఁ బోరి జయమార్జించి తెమ్ము.

(అనుబంధము 19.)

శత్రుఘ్నుఁడు.— అన్నా! తమయానతిని దలమానికంబుగ ధరించి పని నెఱవేర్చెద. సెలవిచ్చినఁ బోయి వచ్చెద.

(వాద్యములతో నిష్క్రమము.)

# తృతీయాంకము.

## ప్రథమరంగము.

### తపోవనము.

మునికుమారులు లవునితో నాడుచుండుట.

మునికుమారులు లవకుమారుఁడు శత్రుఘ్నుఁడు సేన.

లవ.— మునిబాలకులారా! మనకుఁ గావలసినన్ని సమిధలుఁ దగినంత కుశయు సేకరించితిమి గదా. మన గురువులవారు వచ్చుటకు నింకను గొన్నిదినంబులు పట్టును. అంతలో వారు సేయంబూనిన యాగమునకు వలయునంత సామగ్రి సమకూర్పనగును. వారు నాటి పెంచిన తరుగుల్మాదులకు నీరు పోసి యిచటనే పాఠములు వల్లింతము. మీకందఱకు నిది సమ్మతము గదా?

1 మునికుమారుఁడు.— ఓయీ లవకుమారా! నీ వానతిచ్చిన పనులన్నియును జేయుదము. పాఠములు వల్లించు పనిమాత్రము వలదు.

2 మునికుమారుఁడు — నిజము, నిజము. ఎంతటి పనినైనను జేయనగును. చదువుపనిమాత్రము కష్టతమ మని నాకుఁ దోఁచెడు.

లవ.— మునికుమారులారా! అట్టిమాటలు మీరాడఁ గూడదు. వేదవేదాంతపారగులై లోకములో వ్యాపించిన యజ్ఞానాంధకారమును నశింపఁజేయు భారము మీయది కదా? అట్టి మహిమ

మీరాయం దుద్భవమగునది విద్యాప్రభావంబునఁ గదా. కావున మీరు విద్య నభ్యసింపఁ దగదని పలుకుట ధర్మ విరుద్ధము.

1 ముని.—లవకుమారా! నీవేమయిన ననుము. విద్య నాకు నంటదు. ఈవిషయము మనగురువులవారగు వాల్మీకులు తెలిసి కాఁబోలు నాకుఁ గాను బాలరామాయణ మొనర్చి త్రికాలములందును దానినిఁ బఠింపుమని యుపదేశించిరి.

2 ముని.—నిజము, నిజము. నాకును నదియె నుపదేశించిరి. లవా! మేము మా శ్లోకములు వల్లించునంతలో మీరన్నదమ్ములు మా గురువులవారిచే నొనర్పఁబడిన షట్కాండ రామాయణము వల్లించితిరే, అది యెటుల? మీరేమయిన మూలిక సాధించుచున్నారా యేమి!

లవ.—స్వామీ! అంతయు మీ యనుగ్రహమేగాని వేఱొకటిలేదు.

1 ముని.—అంతయును మా యనుగ్రహమైనచో మేము మావిషయమున ననుగ్రహించికొనఁ జాలమే.

లవ.—మునికుమారులారా! గురుసేవచే మీకును బుద్ధికుశలత త్వరలోఁ గలుగును. గురుస్మరణ సదాకాలము సలుపుచుండుఁడు.

2 ముని.—నిజము. నాతలిదండ్రులును గురునామసంస్మరణయు గురుసేవయు చేయుచుండిన యెడల విద్య వచ్చునని తెలిపిరి. కావున సదాకాలము నేను గురుధ్యానమే చేయుచున్నాను.

శ్లోక. కూజంతం రామరామేతి ।
మధురం మధురాక్షరం ।
ఆరుహ్య కవితాశాఖాం ।
వందే వాల్మీకి కోకిలం ॥



3 ముని.— శ్లో॥ వాల్మీకిర్మునిసింహస్య
కవితా వనచారిణః
శృణ్వన్ రామ కథానాదం
కోనయాతి పరాంగతిం.

(గుఱ్ఱము కాలి చప్పుడు వినఁబడుట.)

1 ముని.—లవకుమారా! చూచితివా. ఒకవిచిత్రమైన గుఱ్ఱము మాగురువులవారి పూలతోఁటదిక్కుఁ బోవుచున్నది.

2 ముని.—శరీరము పాలుంబలె నెంత తెల్లనిచాయఁ గలిగినదిగ నున్నది.

1 ముని.—మెడమాత్రము కుంకుమవర్ణముఁ గలదిగ నున్నది.

లవ.—మునికుమారులారా! వీనులు నల్లగ నున్నవి. చూచితిరా!

2 ముని.—తోఁకఁ జూచితివా పసుపుఁ చాయను, నిరసించుచున్నది.

లవ.—దాని ఫాలతలముపై బంగారు ఫలక మొకటి యున్నది. చూచితిరా.

1 ముని.—ఆగుఱ్ఱము మము లక్ష్యపెట్టక మాదిక్కునకే వచ్చుచున్నది.

లవ.—సరసకు రానిండు. దానిఁ బట్టెద.

2 ముని.—లవకుమారా! పిల్లాటలు చేయకు. కఱచును.

(అశ్వ ప్రవేశము.)

లవ.—(గుఱ్ఱమును బట్టి) మునికుమారులారా! ఎంత శృంగారమగు హయ మిది.

1 ముని.—ఇది యెవరి గుఱ్ఱమో తెలియదు.

2 ముని.—దాని ముఖఫలకమున నేవో యక్షరము లున్నవి. చూడుము.

లవ.—మునికుమారులారా! రెండు పద్యము లున్నవి. చదివెద, వినుఁడి.

గీ. వీరమాతసుతుఁడు వీరుఁడు రఘురాముఁ
డంపె యాగతురగ మవనిఁ దిరుగ
దీనిఁ బట్టి కట్టు ధీరుఁడెవ్వఁడో వాని
మాటుఁజేయు రాముఁడాజ్ఞ వినుఁడి.

1 ముని.—రెండవ పద్యమేమి!

లవ.—చదివెదను వినుఁడి.

మ. హయమేధాంచితమైన యశ్వ మిది ధీరాగ్రేసరుం డర్యమా
న్వయ వారాన్నిధి పూర్ణచంద్రుఁ డఖిలానందైక శీలుండు ని
శ్చయదార్ఢ్యైక సుసీతివర్తనుఁడు కౌసల్యాతనూజుండు ని
ర్భయతన్ బంపెఁ దురంగమున్ భువిని గెల్వన్ జాలు సైన్యాళితోన్.

మునికుమా.—లవకుమారా! ఇఁక వదలుము. ఇఁక దానిని వదలుము. రఘురాముల గుఱ్ఱ మిది యఁట. అశ్వమేధయాగమునకుఁ దగిన దఁట. భువినిగెల్చునంతటి పరాక్రమవంతులు భటులు దీనిని వెంబడించినారఁట. మనమో బాపనబాలురము. కందమూలములు దిని యుదరము నించుకొనువారము. చన్నీళ్లార్చుకొని త్రావువారము.

లవకుమా.—మునికుమారులారా! మీరు వెఱవకుఁడి, మిన్నక యుండుఁడి.

1 మునికుమా.—లవకుమారా! మనకిది నర్మంబు గాదు.



సీ. భూషణంబులు విప్రపుంగవులకు స్నానజపతప సంధ్యాది సాంద్రవిధులు,
2 ముని:—భూర్యలంకారముల్ భూభుజులకు నస్త్రశస్త్రాదివిద్యలు సాధనములు,
1 ముని:—కులవృత్తియగును వైశ్యులకు గోరక్షణ కృషికర్మవిధులును కేవలముగ,
2 ముని:—శుద్ధమార్గము సూవె శూద్రజనాళికి విప్రసేవార్చన విధులు మిగుల.

1 ముని:— గీ. విప్రజన్మోచితాచార విధులుమాని
యన్యవృత్తులఁ గోరఁగ నగునె; వలదు
2 ముని:— కందమూలములను దిని కుందుచుండు
బ్రాహ్మణులకేల చావనా బాణవిద్య?

లవ.—మునికుమారులారా! భీరువులంబలె మీరు నాయెదుట మాటలాడకుఁడి. ఆపద్యములు చదివినప్పటినుండి నాశరీరమంతయుఁ దపించుచున్నది. తన్నుఁ గనిన తల్లి కౌసల్య వీరమాత యఁట. అటులైన నన్నుఁ గుశునిఁ గన్న మాతల్లి సీత వీరమాత కాదా! గొడ్రాలా! నాతల్లి సీత వీరమాతయని నే సాధించెద. భువినిఁ గెల్వన్ జాలు పరాక్రమవంతు లీయశ్వమును వెంబడింతురఁట. వారిని నే గెలిచితినేని భువినెల్లఁ గెలిచిన ధీరుఁడ నగుదును.

1 ముని.—లవకుమారా! నీ వతిబాలుఁడవు. బాహుపరాక్రమశక్తి నీకు సున్న. రాముని సేనాధిపతులు వచ్చి నిన్నుఁ గొట్టుదురు. అపుడు నీవు అమ్మా, తల్లీ, యని యేడ్చెదవు

లవ.—మునికుమారా! పిఱికిమాటలాడకుము; రాముని హయము గాదు; బ్రహ్మరుద్రాదులహయములు వచ్చినను నే నిట్టి ప్రగల్భపుఁ బలుకులు విని సైఁపఁ జాలను, నాగురువులగు వాల్మీకుల చరణములకు మానసికాభివందనంబు లర్పించి వారు నాకుఁ గఱపిన బాణవిద్యను సార్థకపఱచెద. నాతల్లి వీరమాత యనిపించెద,

(అనుచు గుఱ్ఱమును దనయుత్తరీయమున బిగించి యరఁటికంబమునకుఁ గట్టును.)

[శంఖ కాహళ ధ్వనులతో భటులు ప్రవేశించి బాలకులఁ జూచి.]

భటుఁడొకఁడు.—మునిబాలకులారా! శ్రీరాములవారి సత్రహయం బది, దాని నంటకుఁడి.

1 ముని.—అయ్యా! వలదన్నను వాఁడే పట్టినాఁడు.

2 ముని.—అయ్యా! మే మేపాప మెఱుఁగము. వాఁడే గర్వించి వలదని యెంత చెప్పినను వినక కట్టినాఁడు.

భటుఁడు—ఓరీ! మునిబాలకా! రావణాంతకుఁడగు రాముని గుఱ్ఱమును గట్టునంతటి గర్వము నీకేల కలిగెను? వదలుము. నీవు బ్రాహ్మణుఁడవే గాక బాలుఁడవును కావున నిన్ను శిక్షింపక వదలితిని; రాము లొనరించు జన్నముఁ జూడఁబోవుదము రమ్ము. అచట నీకుఁ దగిన భక్ష్యభోజ్యములు దొరకును.

లవ.—ఏమీ! రామునిభటులా మీరు? తెలిసెను. హయమును బట్టినవానితోఁ బోరి వాని నిహతునిఁ జేయవలెనని కదా మీరాజుగారి యాజ్ఞ? దానికి విరుద్ధముగ బాలుఁడని నన్ను బతిమాలి యడిగికొని భక్ష్యభోజనమునకు బిలుచుట యుక్తమా? పరాక్రమమా? మీరు నిజముగ శ్రీరాములబంటులైతిరేని మీరాజు నాజ్ఞ నెఱవేర్పుఁడి. కాదేని కుయ్యక మీదారిని మీరు వెళ్లుఁడి. గుఱ్ఱమును నేను వదలను. మీలోఁ బరాక్రమవంతుఁ డెవ్వఁడేని నుండెనేని వాఁడు ముందు నిలిచి గుఱ్ఱముకట్టు విప్పనగును.

భటులు.—ఓరీ! శూరసేనా! ఈబాలుఁడు గర్వించి ప్రల్లదంబులు పలుకుచున్నవాఁడు. మూర్ఖుఁడు. బాలుఁడని కనికరించినచో మము నల్లిదంబుగఁ జూచును. కావున గుఱ్ఱము కట్టు విడవుము. వాఁడడ్డఁబడెనేనిఁ జంపక రెండుదెబ్బలు వేసి బుద్ధిచెప్పుదము.



శూరసేనుఁడు.—అంతగాక; పిల్లలకు దెబ్బలే మంచిగురువులు. (అనుచు గుఱ్ఱము కట్టు విప్పను బోవును.)

లవ.—[విల్లున బాణము సంధించి వేయును.]

శూర.—అయ్యో! చస్తిని యని పడును. భటు లనేకులురా వారి నెల్లరపైనను బాణములు ప్రయోగించి పడవేయును మిగతవారు పరుగిడుదురు.

మునికుమారులు.—లవకుమారా! నీ వెంతగట్టివాఁడవు అనినంతటి పని చేసితివి. చూచితే బక్కపలచని పిల్లవాఁడుగ నున్నావు. ఇంత బల మెచ్చటనుండి వచ్చెను.

లవ.—మునిపుత్రులారా! నా కీబలము మనగురువులవారి యనుగ్రహమువల్లను నాతల్లి దీవెనలవల్లను గలిగినది.

[శత్రుఘ్నుఁడును సేనయుఁ బ్రవేశించును.]

భటు.—[శత్రుఘ్నునిఁ జూచి] మహాప్రభూ! వాఁడే మనగుఱ్ఱమును గట్టి భటులను నొప్పించినవాఁడు.

మునికుమారులు.—అవునయా అవును. వీఁడేను. మేము మీగుఱ్ఱము జోలికిఁ గాని మీభటుల జోలికిఁగాని పోలేదు.

శత్రు.—[లవునిఁ జూచి స్వగతము] ఈబాలునిఁ జూచినంతనె నా మనము దూదికంటెను మెత్తనాయెను. వీనిపై నే నెటుల బాణంబు వేయుదును? మెల్లగ వానియొద్దకుఁ జని ముద్దులాడి యాశలు గొలిపి యుపాయమున హయమును విడిపించికొని పోయెదను.

[ప్రకాశము] కుమారా! నీ వెవఁడవు.

లవ.—ఆజోలి నీ కేల!

శత్రు.—సవన హయము నేల కట్టితివి?

లవ.—మిమ్ము నెల్ల జయించుటకు.

శత్రు.—మునికుమారుఁ డవే నీవు. రణ మొనర్పఁ గలవా

లవ.—రణమున నిల్చిన నాశక్తిని నీవు గందువు.

శత్రు.—కుమారా! బ్రాహ్మణబాలునకు బవర మేల? సాకేతనగరమునకు రమ్ము. అచట నీకుఁ బాయసాన్నభోజనంబు లిడెద. కనకాంబరంబు లిచ్చెద; వలయునన్ని గుఱ్ఱము లేమి యేనుఁగు లేమి యిచ్చెదను. ఈసవనాశ్వమును వదలుము.

సీ. కలమాన్న పాయసంబులు భక్ష్యములు నీకు వడ్డింతు నావెంట వచ్చితేని,
లవ:— కాననాంతరములఁ గాయగూరలఁదిను జనులకు భక్ష్యభోజ్యములవేల,
శత్రు:—రమణీయ హేమాంబరములు హెచ్చయినవి యిచ్చెద నావెంట వచ్చితేని,
లవ:— నారచీరలుగట్టి తారుచుండెడు నాకుఁ గనకాంబరంబుల కలిమియేల,
శత్రు:—నవరత్నమయములౌ నవ్యమందిరముల నిచ్చెద నావెంట వచ్చితేని,
లవ:— కొండలగుట్టల గ్రుమ్మరిల్లెడు నాకుఁ బసిడిని నరుదైన వసతులేల,
శత్రు:—రమణీయకములైన రత్నహారంబుల నిచ్చెద నావెంట వచ్చితేని,
లవ:— మేలైన రుద్రాక్ష మాలిక లుండఁగ రాజిత రత్నహారము లవేల.

శత్రు:—గీ. రాజుగను నేలు మేలైన రాష్ట్రములను
నిచ్చెదను నీకు నావెంట వచ్చితేని
లవ:— విపినతలముల మునిలీలఁ దపము సేయు
వానికిని నేల రాష్ట్రాధి వాసమేల.

శత్రు:—గీ. సవనహయమిది వదలుమా చలము దేల?
లవ:— పట్టివదలిన వానికిఁ బ్రాణమేల?
శత్రు:— బాలుఁడవు నీవు ప్రాణంబుఁ బాసెదేల;
లవ:— మరణముండిన వలదన్న మాననేల?



[ఈపద్యము పట్టాభిరామాయణములోని భావమును పద్యశైలి ననుసరించినది.

శత్రు.—[దూరమునకు వచ్చి, స్వగ] ఔరా! ఈబాలుని నిశ్చయబుద్ధి. ఈబాలుని మాటలు వినినకొలఁది నామానసము కరఁగుచున్నది. వీఁడు మునికుమారుఁడు కాఁడు. ఎవఁడో రాజపుత్రుఁడు ప్రచ్ఛన్నవేషమున నున్నవాఁడు విచారించెద. [లవునిఁ జూచి] బాలకా? సవనహయము మాట లటు లుండనిమ్ము; బవరపు మాటలు దూరమ్మున నిలువనిమ్ము. నీ వెవఁడవు?

(అనుబంధము 21)

లవ:—అయ్యా! నీ కాయధికప్రసంగ మేల? నాతో సంబంధ బాంధవ్యంబులు నెఱపెదవా? కులగోత్రములు విచారించెదవు. హెచ్చుగా ప్రశ్నింపకుము. నేను వాల్మీకిఋషి శిష్యుఁడను. లవకుమారుఁడని నాపేరు.

శత్రు:—స్వగ. నాసంశయము మరల హెచ్చెను. ఆకారలక్షణంబులు నాసోదరుఁడగు శ్రీరాములఁ బోలినవి.

లవ:—అయ్యా! నీవు మాటలతోఁ బని ముగింపఁ జూచెదవు కాఁబోలు. వీరుఁడవైతేని నే బంధించిన హయమును విడిపించి కొనిపోయి నీయధిపుని యానతి నెఱవేర్పుము. కాదేని హీన క్షత్రియుని మాడ్కిఁ బరుగిడుము.

శత్రు:—(స్వగ) బాలుఁడైనను వీఁడు క్షత్రియకుమారుఁడు. ఈ పసికూనతో నే నెట్లు యుద్ధ మొనర్తును? (లవునిఁ జూచి) బాలకా! నామాటలు వినుము. లవణాసురాంతకుఁడ నేను. లవణమన్నమును దిని మృదువగు గాత్రముగలవాఁడవు నీవు. రణకిణాంకితములుగలిగి

దృఢపడిన శరీరముగలవాఁడను నేను. ఒక చెంపనఁ బాలు నొక చెంప నుగ్గుఁగల కోమలాంగుఁడవు నీవు. కావున నీకు నాతో యుద్ధ మనుచితము. ఇంటనుండెడి నీతల్లి నిన్నుఁ దలఁచుచు నెంతగఁ దపించునో కదా! తోడిబాలురం గూడి నీయిల్లు సేరుము. నాహితము వినుము.

లవ:—కం. హీనక్షత్త్రియ జాతిగ
నే నెఱిఁగితి నీవుడు నిన్ను నిజముగ మదిలో
మానుము రణమని వేఁడుని
మానముగల క్షత్త్రియుండు మఱి యెంతైనన్.

ఓరీ! క్షత్త్రియాధమా! బాలకా! బాలకా! యనుచుఁ బలుమాఱు పలుకుచుఁ గనికరంబుఁగలవానిం బలె నటించుచు సమరము మానఁ జూచితివి కాఁబోలు. సరి సరి, నీ కనికరంబు నీమరణాంతముం గనెనేమో చూచెద. నేను బాలుఁడని బాణములు వేయ వెను దీసితివి కాఁబోలు; కానిమ్ము. ప్రారంభమున నేనే నీపై బాణంబుఁ బ్రయోగించెద. చూడుము.

(బాణము వేయును.)

ఓరీ! క్షత్త్రియోత్తమా! చూచితివా బాలుని బాణము! దారుణమో శైత్యమో భేదింపఁబడిన నీతనుత్రాణంబును బ్రశ్నింపుము.

శత్రు:— కోపమున) ఓరీ! బాలకా హెచ్చులు పల్కకు.

చం. అరెవరె మానితూన యిటు లార్వఁగ నేలర బాలుఁడంచు నేఁ
దర్వరపడనైతిఁ బోరునఁ దథ్యము దానినిఁ గానకీవు మీ
దరయక కుందులాడఁగను న్యాయము చూడుమ నాదుశక్తి యీ
దరమున నిల్పి నీ విరకను మాపుణభాగులు మాని యుండుమా.



(అనుచు బాణము వేయును. దానిని లవకుమారుఁడు ఖండించి.)

లవ:—చం. అగునగు క్షత్త్రియోత్తముఁడ వైతివి నీ విపు డెన్నిచూడఁగా
తెగెఁ గను నీశరంబదిగో; ధీరత నింక సమస్తవైరిజీ
వగతులఁ గ్రోలఁ గాఁ దివురు బాణముఁ బంపెద నైఁదికానరా
తగినది యౌను కాదో యది తక్కువయేని మఱొక్కటం పెదన్.

(అనుచు దారుణ శరం బొక్కటి వేయును.)

శత్రు:— (వేదనచే దహాతహాఁబడి స్వగ) ఆహా వీఁడు బాలుఁడుగాఁడు. బాలుఁడని నే నెల్లిదంబుగఁ జూచితేని నా యాయుఃపరిమితికి నత్యం బీగడియ యనవలసినదేను. వీఁ డెవఁడో వీరక్షత్త్రియ కులోత్తముఁడగు మహనీయుని కుమారుఁడు. మంత్రసంపన్నుఁడు. నే నెన్ని బాణంబులు వేసినను నడుమనే ఖండించుచున్నవాఁడు. శస్త్రము లేవియు వీనిని బాధింపఁ జాలవు. ఉత్తమాస్త్ర ప్రయోగంబు ఫలకారి కావున నారాయణాస్త్రంబు ప్రయోగించెద. (అనుచు నాకాశముదిక్కుఁ జూచి కేల్మోడ్చి.)

కం. నారాయణ భువనావన
పారాయణ పరమపురుష పరపారగతా
వారణరక్షణ చరితని
వారణ చణచరణ నీకు వందన మిదెవో.

(అనుచు నారాయణాస్త్రంబు వైచును)

లవ:—[లవకుమారుఁడు దానినిఁ దప్పించుకొనుటకుఁ బ్రయత్నము చేసి నిష్ఫలుఁడై నిలువ నస్త్రం బెదఁ దాఁకి మూర్ఛఁగొని క్రిందఁ బడును.]

శత్రు:—[సమీపించి బాలునిఁ జూచి దుఃఖించి] ఎంత ముద్దులొలుకు కళలు దేఱు పసిబాలుఁడు వీఁడు. వీనిఁ గన్నతల్లియే వీర

మాత. ఏమీ! ముఖలక్షణం బించుక దృష్టించి చూచినచో రఘురాముని నోటినుండి యూడిపడినట్టు లున్నవాఁడు. ఆహా! ఏమి వీని విశాలనేత్రములు! వీని యాజానుబాహువులు! [కేలుఁ జూచి] ఏమీ! వీనికిఁ జక్రవర్తి చిహ్నము లున్నవిగదా! నాసోదరుఁడగు రాముని కుమారుఁడుగనుండునా! ఆమహాపతివ్రతా శిఖామణిని సీతను పూజ్యురాలగు నావదినెను నిండుచూలాలి నాయగ్రజుఁడరణ్యంబున వదలివచ్చితినని పలికెను. వీఁడు ఆపురంధ్రీమణి పుత్రుఁడుగ నుండునా! దానికి సందియ మెన్నఁటికి నుండదు. కాలమునుబట్టి చూచినను వీని వయస్సంతకంటెను హెచ్చుగ నుండదు. సోదరపుత్ర హంతకుఁడ; నే నెంత పాపాత్ముఁడనో కదా! అయ్యో తండ్రీ! నీ లలిత వయోవిలాస లక్షణములు తలఁచి నీతల్లి నీకునై యెంత తపించునో నన్నెంత శపించునో కదా! కయ్యము వలదని నెయ్యఁపుఁ బలుకులు నే నెన్ని పలికినను నీవు వినవైతివి. దైవగతి మాన్ప నాతరమా? ఇపు డేమి సేయుదును! [ఆలోచించి] నా యన్నగారగు శ్రీరాములవారి సరసఁ జేర్చెద. ఉన్నవార్తఁ దెలిపెద. [అనుచు లవుని నెత్తికొని వెళ్లిపోవును.]

[దాఁచికొనియున్న మునికుమారులు వెలికి వచ్చి.]

1 ముని:—ఏమిరా గర్గా! వలదనినను లవకుమారుఁడు పోరుకెక్కి పోరొనర్చి చచ్చెను. మన మిపు డేమి సేయవలయును?

2. ముని:—చేయున దేమియున్నది? కన్నవార్త తూచా తప్పక వాని తల్లికిఁ దెలుపుదము.

1 ముని:—ఆ పునీత సీత వానిఁ దలంచుకొని యెంతదుఃఖించునో కదా!



2 ముని:—దుఃఖింపదా మఱి. ఆమెది కన్నకడుపు గాదా! ఈదినము మనము లేచినవేళ మంచిది కాదు. ఏమి యనుకొనిన నేమి ప్రయోజనము? రమ్ము. పోవుదము.

(నిష్క్రమము.)

## ద్వితీయరంగము.

ఋష్యాశ్రమము.

సీత, మునికుమారులు, కుశుఁడు.

(అనుబంధము 23)

సీత:—ఉ. భానుఁడు పశ్చిమాద్రిఁబడి బాహుసహస్రముఁ గోలుపోయె నా
సూనుఁడయో లవుం డడవిఁ జొచ్చి గృహంబును జేరఁడాయెఁగా
సూనసమాన కోమలుఁడు సూనశరోపమ బాలుఁ డేలొకో
కానను నిల్చెఁ గారణముఁ గానను కానను వచ్చు జాడయున్.

[నలుదిక్కులఁ జూచి] ఏమీ! ఏదిక్కునఁ జూచినను వాఁడు వచ్చు జాడ లేదు కదా? ఏమి సేయుదు. నామానస మేలొకో కళవళ పడుచున్నది. అయ్యో! లవకుమారుఁడు సుకుమార శరీరుఁడే! తోడిబాలురం గూడి యేగుట్టలెక్కి జారెనో, ఏచెట్టులెక్కి పడెనో, ఏగొందలలో దూరెనో? ఏపుట్టలు నెక్కెనో; అయ్యో! కనుగందని పసిబాలుఁడు వాఁడు విషమాటవులు ద్రొక్క నర్హుఁడా?......... ఏమో! బాలురు వచ్చుజాడ నగపడెడు. లవుని వెంబడించిన మునికుమారులు వారే కదా? అడిగి తెలిసికొనియెద.

[మునికుమారుల ప్రవేశము.]

మునికుమారులారా! లవకుమారుఁ డేల మీ వెంట రాఁడయ్యెను!

1 ముని:—[రెండవవానిఁ జూచి] తెలుపరాదేమిరా? బెల్లముకొట్టిన గుండువలె నిలిచినావు.

2 ముని:—నీవే తెలుప రాదా?

సీత:—బాలకులారా! నాబాలునివార్త తెలుపుటకు సంశయింతు రేల? వెనుక వచ్చుచున్నవాఁడాయేమి?

1 ముని:—అమ్మా! వనములో ఫలపుష్పములు గోయుచుంటిమి.

2 ముని:—అమ్మా! నిజము అపుడొక విచిత్రమగు గుఱ్ఱము వచ్చెను.

1 ముని:—మేము వలదని యెంత వేఁడికొనినను నీసుతుఁడు దానిని బట్టికట్టెను.

2 ముని:—వెంటనే పుట్టలు పగిలి చీమలు వెడలినటుల భటులు వచ్చి యెదిరించిరి.

1 ముని:—వారినెల్లరను దుత్తుమురులుగ లవకుమారుఁడు ఖండించెను.

సీత:—అదికదా క్షత్రియోత్తముని సహజగుణము.

2 ముని:—వారందఱుఁ బడినపిదపఁ బిడుగుఁబలె మఱియొకరాజు వచ్చి నీబాలునితోఁ బోరి క్రిందికిఁ గెడపెను.

సీత:—హా! లవకుమారా.

1 ముని:—ఆయోధుఁడు నీబాలు నెత్తికొని పోయెను.

[సీత మూర్ఛపోయి మరల లేచి.]

[అనుబంధము 23.]

తనయా! లవా! ముద్దులుగులుకు నీముద్దుమోము ననుఁబోలు నిర్భాగ్య చూడరాదని తలఁచితివా?



కం. వనములఁ గూరలు కాయలు
దినుచును నొకరీతిగాను దినములు గడపన్
గను మనకుఁ బోరు తగునే
తనయా! నీవెందు జనితో తలఁచితొ నన్నున్.

అయ్యో! నిర్భాగ్యయగు నాజన్మంబే వ్యర్థంబు. కనికరము మాని కఠినతఁ బూని నీతండ్రి కారణంబులేక నిండుగర్భంబుననున్న నన్నుఁ గానలోఁ బడద్రోసెను. ఆదుఃఖంబు సుతులను గని మఱచి యుంటిని. నిర్భాగ్యకు సంతసం బేల నని పట్టరాని దుఃఖమున విధి నన్ను ముంచెను. అయ్యో! కుమారా! ముద్దులుగుల్కెడు మాటలచే ప్రొద్దుపుచ్చువారు నాకిఁక నెవరు? వనములకుం బోయి ఫలములు దెచ్చి ననుఁ జేరి నాయొడినిండునటుల ఫలము లుంచి ముసిముసి నవ్వులు నగువారు నాకిఁక నెవర్రా తండ్రీ! ఒకానొకవేళ నాతో మాటలాడుచు అమ్మా నాతండ్రి యెవరని యడిగి నేమౌనము వహించినది గని బలాత్కారముగఁ బల్కరింపఁ బూనువారు మఱి యెవరురా తనయా! నాతొడమీదఁ గూర్చుండి మోముఁ జూచుచు విడెమందించు వారిఁక నెవరురా కొడుకా! పారిజాతపుష్పములం దెచ్చి నాకొప్పునఁ దుఱిమి "అమ్మా! ఈపూవులు నీకు లక్షణములుగ నున్న" వని పలుకువారిఁక నెవరురా తండ్రీ!

సీ. మిథిలాధినాథుని మెచ్చుల తనయనై జనియించి దుఃఖాబ్ధి మునుఁగవలనె,
కొమరొప్ప దశరథు కోడలునై యింత కష్టాబ్ధి నీఁదెడు గాలమొదవె,
రావణాంతకుఁడగు పావను రాముని దారనై కానలోఁ దాఁటవలనె,
శత్రుఘ్న భరత లక్ష్మణులకు వదినెనై యడవిని నిడుములఁ బడగవలనె.

గీ. దిక్కుఁగల్గియు నక్కటా! దిక్కులేని
దీననైతిని దైవమా కానదారి
నుదుట వ్రాసిన వ్రాఁతకు నెదురు గలదె
మనఁగలే నిఁక ముద్దుల తనయ నేను.

తండ్రీ లవకుమారా! ఘోరమైన యీ యరణ్యమున మిముఁ జూచి సంతసమునఁ గాలము గడుపుచుంటిని కదా? ఇఁక నా కానంతస మెచటనుండి వచ్చును? తండ్రీ! నన్నుఁ జూచి "అమ్మా నీ వాఁకొంటివి గదా. ఇదిగో మధురఫలములు భక్షింపుము" అనువా రెవరు? తల్లీ, నీకు దాహమయ్యెను కాఁబోలు; నిర్మల జలంబులం దెచ్చినాను త్రావుము" అని యిచ్చువా రెవరు? హా నాయనా! సుకుమార సుందరకాయా! లవకుమారా! నీ వియోగము నే సైఁపజాల. నీకు నే నిడిన దీవెన లన్నియును రిత్తపోయెను. అయ్యో!

ఉ. హా జగదేకమోహన శ్రితావన పావన నాదుజీవనా
యాజిముఁ డాజి నిల్చి నిను నార్చెనె యోర్చెనె నీదుబాణముల్
నీజవసత్త్వసంపదలు నిన్నెడఁబాసెనె నీవె నీఁగితే
రాజితశాత్రవుండెటు దురంబున నిన్నెదిరించె బాలకా.

హా. సైఁపనోప, (అనుచు మూర్ఛపోయి నేలఁ బడును.)

[కుశుని ప్రవేశము.]

కుశ:—(సీతను జూచి) ఏమిది నాతల్లి సోలి నేలపైఁ బడినది. నాతమ్ముఁ డిచట లేఁడు. కారణ మేమి యుండును?

కం. అమ్మా యేమిది చిత్రము
సొమ్మసిలన్ బడితివేల సొంపటి? నన్నున్
రమ్మాయని పిలువవు? కు
ద్దిమ్మాయని బుజ్జగింప విది యేల యొకో.

అమ్మా! ఏల మాటలాడవు? ఎవరినుండి నీకేమిమాట వచ్చెను? ఎవ రేమి యెగ్గొనర్చిరి.



(అనుబంధము 24.)

(సీత లేచి.)

సీ. సురుచిరాలంకార సుకుమార పోయితే లలితశుభాకార లవకుమార,
రంగారుబంగారు సింగారముల్ గేరు లలితశుభాకార లవకుమార,
అలికులంబుల నేలు నలక లేమాయెరా లలితశుభాకార లవకుమార,
చిగురుచాయల కేలు జిగియెందుఁ బోయెరా లలితశుభాకార లవకుమార.

గీ. నవసుమోహన సుకుమార లవకుమార
సవనహయమేల పట్టితి లవకుమార
బవరమున కేల నిల్చితి లవకుమార
యాఁగనిఁ బడిపోయితే నీవు లవకుమార.

(అనుచు మరల నేలవ్రాలును)

కుశ:—ఇది యేమి దుఃఖమైనది ఇంచుక తెలిసెను. నా సోదరున కేమో విపత్తు సంభవించినది. ఏదో సవనహయమఁట. లవకుమారుఁడు దానినిఁ బట్టెనఁట; బవరమునఁ బడిపోయెనఁట. నాకు దారినిఁ గలిగిన దుశ్శకునముల ఫలము నిజమాయెను. ఎటులయినను నాతల్లిని సమాధానపఱిచి నాసోదరుఁడు జమునిపట్టణముఁ జేరియుండినను బిలిచికొనివచ్చెద; ఆలస్యమునకుఁ గాలంబు లేదు. (అనుచుఁ దల్లినిఁ దనతొడపై నిడికొని) అమ్మా! లెమ్ము. ఇంచుక సమాధానపడియుండుము. నీదుఃఖకారణంబుఁ దెలుపుము. ఎంతటి పనియైనను నెఱవేర్చి నీమనమునకు సంతసంబుఁ గలిగించెద. నమ్ముము.

[సీత లేచి.]

సీత:—[కుశునిఁ జూచి] నాయనా! కుశకుమారా! నీ సోదరుని మోముఁ జూచునంతటిభాగ్యము నాకు నేఁటికిఁ దుదియాయెను?

కుశ:—మాతా, మాటలు నిలుపకు. ఉన్నసంగతి వివరముగఁ దెలుపుము.

సీత:—నాయనా, నీసోదరుఁడు నేఁడు మునికుమారులం గూడి వనమున సంచరించుచుండ నెచ్చటినుండియో వానిపాలి మృత్యువు రీతి నొకగుఱ్ఱము వచ్చెనఁట. పిల్లాటలకు దానిని నీతమ్ముఁడు బట్టెనఁట. అశ్వమును వెంబడించిన భటులను జంపెనఁట. పిదపఁ బరాక్రమవంతుఁడగు సేనాధిపుఁ డొకఁడు వచ్చి లవునితో యుద్ధమాడి నాముద్దుకొమారునిఁ గ్రిందఁగెడపి హయముతో పాటు లవకుమారుని నెత్తికొనిపోయెనఁట.

కుశ:—తల్లీ! నాసోదరుని ప్రాణంబునకే భయమును లేదు. దీవించి నన్నుఁ బంపినచో లవునితో సైతము జయమార్జించి తెచ్చెద.

కం. చెచ్చెర సెలవిమ్మా నేఁ
జిచ్చైనను జొచ్చి యనుజుఁ జేరఁగ జనుచున్
దెచ్చెద లవునిన్ జయమున్
నిచ్చయమిది నమ్మవమ్మ నెమ్మదిఁ గనుమా.

సీత:—కుశకుమారా! ఏల యిట్టి యసాధ్యపుఁబనిఁ బూనెదవు? కరి రథ ఘోటకాయుతములు గలిగిన మహారథవీరులు వారు, ఒకకాల్బంటైనను లేని బాలుఁడవు నీవు. సాహసవృత్తినిఁ బూని శరములు వేయ సమర్థుఁడవు కావు; చిన్నిబిడ్డవు. సేన నెట్లు చెండాడెదవు? వలదు. ఉన్న యొకకుమారునినైనను జూచికొని దినంబులు గడపెద.

కుశ:—తల్లీ, ఉత్తమక్షత్రియాంగనవు నీవు. పురంధ్రీమణివి. అనుజుని శాత్రవుఁడు చెఱఁగొని పోవునపుడు చచ్చినవానింబలెఁ నూఁడి యుండుట క్షత్రియధర్మమా? సరివారు నన్నుఁ గని నగరా.



వేళ నేహతుఁడనైతినేని వీరస్వర్గ మందెద. నీవు వీరమాతవయ్యెదవు. క్షత్రియాంగనకు నింతకంటెను సంతస మేమున్నది! ఇదిగో నీచరణములంటి మ్రొక్కెద; దీవెనలతో సెలవిమ్ము.

(అనుచు నమస్కరించును.)

సీత:—సీ. ఆసురుఁడౌవృత్రుని యసురారి సురలెల్ల మఘవున కిచ్చినమంగళంబు,
సుధనుదెచ్చెడుతఱి శుభముగ వీనుని మాతయిచ్చిన ఘనమంగళంబు,
సుధనుచిలికెడు వేళ సురలకు నదితితా నంగుగానిడు జయమంగళంబు,
వామనునకు బలిబంధనంబున సురమాతయొసంగిన మంగళంబు,
కాకుత్థ్సునకు నాఁడు కౌసల్యజనని తా మమతను నిడినట్టి మంగళంబు.

గీ. నీకునగుఁగాత తనయ నిర్నిద్రుఁడగుచు
క్షత్రియోత్తముఁ డనుపేరు సార్థకముగఁ
జేసి చేరుము తల్లిని శీఘ్రముగను
యశము దిశలెల్ల నింపుమా కుశకుమార.

[కుశుఁడు నిష్క్రమించును.]

హా, హా, ఎంతటి యుత్తమక్షత్రియాంగన యయినను యుద్ధావని బుత్రుఁడు పోయెనేని మనమునఁ గళవళపడుచుండును గదా! నాకుమారుని సుకుమారుని సిద్ధసాధ్యాదులు సురలు సుహర్షులు దిక్పాలురు సప్తఋషులు సూర్యచంద్రాదిగ్రహములు సదాకాలంబు రక్షింతురని వేఁడెద.

సీ. కోరివేఁడెద మిమ్ము కుజములారా మీరు కుశకుమారునకును కుశలమిడుఁడి,
నతులొనర్తును వనస్పతులార మీకును కుశకుమారునకును కుశలమిడుఁడి,
శరులార గిరులార ఝరులార ప్రార్థింతుఁ కుశకుమారునకును కుశలమిడుఁడి,
యతులార విపినదేవతలార నుతియింతు కుశకుమారునకును కుశలమిడుఁడి.

గీ. దశదిశాధిపులార నిద్దంపుదయను
కుశకుమారునకును మీరు కుశలమిడుఁడి

అహరహముసెంతు మీరు నవగ్రహములార
కుశకుమారునకును మీరు కుశలమిడుఁడి.

(నిష్క్రమము.)

## తృతీయరంగము.

[అరణ్యము.]

లవ కుశ శత్రుఘ్నులు. సైన్యము.

కుశ:—లవా! సేనను తుత్తుమురులుగఁ దునిమి తురంగమును మరలఁ దెచ్చితిమి, అదిగో సేనాధిపతి మంటలు గ్రక్కుచు మము వెంబడించుచున్నవాఁడు మనపైఁ బడును. హెచ్చరిక. ఏదీ నీచేతి విల్లు!

లవ:—అన్నా నే మూర్ఛపోయియుండినతఱి నా విల్లు పోయినది.

కుశ:—అటులయిన నిరాయుధుఁడవై యుద్ధమెటు లొనర్తువు!

లవ:—అన్నా! మనగురువులవారు గఱపిన సూర్యమంత్రము పఠించి యభేద్యమైన ధనువు వరముగఁ గొనియెద.

కుశ:—అటు లొనరింపుము.

లవ:—[సూర్యునకుఁ జేల్మోడ్చి నమస్కరించి] దండకము! శ్రీమన్మహాభాస్కరా, తప్తచామీకరాకార సర్వేశ్వరా యీశ్వరా యోసుపర్ణాశ్వబింబాంతరా సర్వదేవాత్మకా ఋగ్యజుస్సామవేదాత్మకా! రశ్మిమంతా వివస్వంత దీప్యత్సముద్యంత హర్యశ్వ సప్తాశ్వ వీరా రవీ ద్వాదశాత్మా హరీ వ్యోమనాథా తమోనాశకా పింగళా మండలీపూష పద్మప్రబోధా సువర్ణాంతగర్భా సుపర్ణా జగచ్చక్షు



తేజస్వి సారంగ మార్తాండ నీయంశు జాలంబు లోకాళి సృష్టించు పోషించు నాశింపఁజేయుం గదా బ్రహ్మ విష్ణుర్మహేశాను లీవే గదా ఇంద్రవహ్న్యంతక క్రవ్యపాశి జగత్ప్రాణ పౌలస్త్య భూతేశ దిక్పాలకుల్ నీవె గావా మునుల్ సిద్ధులుం సాధ్యులుం భూచరుల్ ఖేచరుల్ రాక్షసుల్ పంచతత్త్వంబులుం సర్వమున్ నీవు గాదా మహాభావ దేవా వరోన్మత్తగర్వంబునన్ మున్ను క్రవ్యాదులా రావణుం డెల్లలోకంబులన్ గాసిపెట్టన్ డిటం బొప్ప రేద్రిమ్మతిన్ జంపఁగాఁ బూని కోదండరాముండు యుద్ధంబు సేయన్ సమర్థుండుగా కెట్టులో యంచుఁ జిత్తంబునన్ జింతిలంగా నగస్త్యుండు ప్రత్యక్షుఁడై యేమహాదేవు ధ్యానంబు బోధించె నాదిత్యహృన్నామ మంత్రంబునన్ భక్తి నాదేవుఁ డీవే కదా! దేవదేవా ధనుర్బాణముల్ లేక ఘోరాజిలో శాత్రవాళిన్ జయింపంగ నేఁ జాలకున్నాను నన్నెట్లు కాపాడెదో కార్ముకంబిచ్చి దేవాదిదేవా వరంబిచ్చి కావన్ నినుం వేఁడెదన్ నన్ను రక్షింపు రక్షింపు నే మ్రొక్కెదన్ మ్రొక్కెదన్.

శ్లోకం. జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమోనమః
నమోనమ స్సహస్రాంశో రాదిత్యాయ నమోనమః.

[అనుచు నమస్కరింప పైనుండి కార్ముక బాణ తూణీరములు పడును.]

లవ:—అన్నా! మనకు దైవానుగ్రహమున్నదికాన జయంబు సిద్ధంబు.

కుశ:-లవకుమారా! ఏపరాక్రమవంతుఁడిపు డెదురుపడునో చూచెద.

(అనుబంధము 25.)

[వాద్యములతో శత్రుఘ్నుఁడును సేనయు వచ్చును]

శత్రుఘ్ను:—[కుశునిఁ జూచి] ఓరీ మునిబాలకా! నీదారుణ శరంబు నాయెద నాటినకారణంబున రథంబుపై నే సొమ్మసిలితి,

అట్టికాలంబున నీవీ బాలకునిఁ దెచ్చుటయేగాక నాసేన నోడించి సవనతురంగముఁ బట్టి తెచ్చినావు. నీవు పసిబాలుఁడవు కావున నీబలము నెదిరిబలముఁ దెలియఁ జాలకున్నావు. నీ వెవఁడవు! నీ జననీజనకుల పేరేమి? నాచే జయింపఁబడి యిపుడు నీసరసఁ జేరిన బాలుఁడు నీకేమి కావలయును! మీరు మునిబాలకులు, క్షత్త్రియ శూరులతో యుద్ధమాడిన నేమగుదురో తెలియదా!

కుశ:—ఏమీ! క్షత్త్రియోత్తమా! ఏమి పలికితివి! మునులబలము కంటెను క్షత్త్రియులబలము హెచ్చా?

సీ. వరసూనములఁ జేసి కరికుంభమున నిడ్డ పురహరుని మత్తుఁ బూదిఁగలిపె,
కులలేని చలమూని బలు కీనినలయింప వెలివాని కొలువున మలపి నిలిపె,
హయచోరుఁడని కాకలియల నిడ్డ సగరాత్మజుల వహ్ని కీలల బలిగ నిచ్చె,
తనకన్న ధరనెన్నఁ దగుమిన్న లేదన్న క్షితిపుని దేహంబుఁ జీల్చి వ్రేల్చె.

గీ. జగతిఁ దాపసమహిమాతిశయము వినవె
జగము లెల్లను భీతిలి జలదరించు
మాడుమార్లు వెలితురు మునులు కినియ
నేలకో యోధవర నీకు నింత పొగరు.

శూరోత్తమా! మునికుమారులని మమ్ము నెల్లిదంబుగఁ జూడకు. వహ్ని యణుమాత్రమైనను ఘోరారణ్యంబుఁ గాల్చును. గొడ్డలి చిన్నదైనను భూరివృక్షంబును నఱకును.

శత్త్రుఘ్నుఁడు:—బాలకా! నీవేషంబు మునికుమారునిఁ బోలి యున్నను నిజముగ నీవు మునిబాలుఁడవు కావని నాకుఁ దోఁచెడు.

కుశ:—శూరవరా! నే నేకులమువాఁడనైన నేమి? ఎవఁడైన నేమి! నాతో వియ్యమందెదవా! సమరతలమున సామర్థ్యతారతమ్యంబుఁ గనవలెనుగాని సంబంధబాంధవ్యములతోఁ బ్రయోజన మేమి?

శత్త్రు.—బాలకా, నీతల్లి పేరేమి!



కుశుఁడు.—అవునీత పేరు సీత.

శత్త్రు.—శస్త్రములు గ్రిందఁబడవైచి కూర్చుండును

కుశ.—ఏమీ! యోధవరా కూర్చుంటివి.

కం. బలముఁగలదేని లెమ్మా
చలమున్ సమరమునఁ జూపి జయమును గొనుమా
కలనకు వెఱచితివేనిన్
వలదని శరణనుము నేను వదలను హయమున్.

అయ్యో! నీవు యుద్ధభీరువైతేని సవనహయమును మాకు వదలి ప్రాణము రక్షించికొనుము.

శత్త్రు.—బాలకా! నేను లవణాంతకుఁడను. శత్త్రుఘ్నుఁడను. ఇట్టి వాఁడను నేను యుద్ధభీరువు నగుదునా! మునివృత్తిని నుండు ముని బాలకులతోఁ బోరి జయించినను భూరియశము రాదు. ఇట్టి ప్రల్లదంబులు పలికిన యాబాలుఁడు రణావనిన్ బడి భాగ్యవశంబున బ్రదికెను. నీవు నటులయ్యెదవే యని చింతించెద. నావెంట నా పురంబునకు వచ్చిన మీ రేమిగోరితిరేని వాని నిప్పించెద. మృష్టాన్నభోజనంబు లిడెద. కట్టఁగనకాంబరంబు లిచ్చెద. రండు.

కుశ.—అయ్యో! నీవ నేఁడు భూషణ భక్ష్య భోగ్య వస్తువులు నామానసముఁ జలింపఁ జేయునని తలంచితివా యేమి!

ఉ. మూరలు గాయలున్ దినుచు ఘోరతరంబగు కాననంబునన్
క్రూరమృగాళితోఁ జెలిమిఁ గోరుచు స్నానజపాదికర్మలిం
పారఁగ నాచరించు మునిబాలకులెందును నిచ్చగింతురే
భూరిమదప్రదంబులగు భూషణ భోజన భోగ్యవస్తువుల్.

ఇట్టి యాశలు గొల్పవలదు.

శత్త్రు.—(స్వగ) ఈబాలుఁడు సైతము రఘురామునిఁ బోలియున్న వాఁడు. ఈబాలుని వదనచంద్రునిఁ జూచిన మానసానందకరముగ

నున్నది. నేత్రనీరజములు ఆజానుబాహువులు విశాలతరమైన యురము పదపల్లవము గనిన నాసోదరుఁడగు రాముని పుత్రుఁడనుటకు సందియము లేదు. వీరిరువు రమడపిల్లలని దోఁచెడు. తల్లి పేరు సీత యని యీబాలుఁడు నుడివెను. ఆ పునీతయగు భూజాత సీత నావదినెగదా; నే నెటు లీకుమారులపై శరములు ప్రయోగింతును? అట్టి కఠినతకు నామన మియ్యకొనదు.

కుశ.—ఏమీ! యోధవరా! బవరము వలదా? సవనహయము మాకు వదలి పోయెదవా? నిన్నేలు రాజుగారి యాజ్ఞ ధిక్కరింతువా? క్షత్రియకులంబునకు నందున దశరథునివంశమునకుఁ గళంకముఁ దెత్తువా?

లవ.—అన్నా! ఈయోధవరునిపై మనము బాణములు వేసి నొప్పించువఱకుఁ దాను విల్లందఁడు.

కుశ.—అటులనా! ఇదిగో శరములు వేయ నేను ప్రారంభింతును.

(అనుచు బాణము వేయును.)

శత్రు.—(నొప్పి నభినయించుచు స్వగ) చిన్నకొమారులతో రణమొనర్పఁగూడదని నే నెంత శాంతి వహించినను బాలస్వభావమున నీబాలురు పైఁబడి వచ్చుచున్నారు. వీరితో యుద్ధము చేసి కఠినబాణములు ప్రయోగించితినేని బాలురకు నపాయము గలుగును. ఆవార్త విని రాముఁ డెంత చింతిలునో; అటు చేయక రణము వదలుదమన్న రామునాజ్ఞకు వ్యతిరిక్తముగ నడచినవాఁడ నగుదు. సవనహయము వదలిపోయితినేని యజ్ఞము నిలిచిపోవును. అపయశము సమకూరును. ఇన్ని విరుద్ధాంశములను సరిపుచ్చు దారిఁ గానకయున్నాను. [ఇంచుక యాలోచించి] సరి వీరితో యుద్ధమొనర్చి



యెటులనయినను వీరినిఁబట్టి రాములవారి సరసకుఁ దీసికొనిపోవుట ప్రస్తుతకర్తవ్యము. అటు లొనరించెద.

[అనుచు విల్లందికొని]

ఓరీ! బాలకా! మునివృత్తినిఁ గాన నివసించు మునిబాలకునిపై బాణప్రయోగంబ నర్హంబని వెనుద్రొక్కితిని గాని బలహీనతచే గాదు ఇదిగో యుద్ధమునకు నిలిచితిని.

కం. మునివృత్తి నుండువానికి
ననివృత్తి విరుద్ధధర్మమని హితమును నే
వినిపించితి నదికాదని
మనమును నొప్పించితి వీవు మాటలచేతన్.

రోగికి మందు చేఁదనులాగున నాహితము నీయందు విషమించెను. కానిమ్ము. సామసాధ్యము కాదని దండసాధ్య మగునని పెద్దలు వచించిరి. మిము దండించెద. కనుఁడి.

(అనుచు బాణంబు వేయును.)

కుశ.—(లవునిఁ జూచి) లవకుమారా! నీవు సేనను జక్కాడి గుఱ్ఱమును గాపాడుము. నే నీ యోధవరుని యుక్కడఁచెద.

(అనుచు బాణము వేయును.)

శత్రు.—(నొచ్చికొని స్వగ) ఈబాలుని తీక్ష్ణతమమైన బాణము నా కవచము భేదించి నను నొప్పించెను. నేనును గఠినశరములు ప్రయోగింపవలయును.

(అనుచు బాణమందు.)

శాతశరవృత్తము. శాతశరమిది దీనిఁ గనుమా నైఁచనిల్వుము ధీరతన్
భూతతటికిని వైరియనుకుల భక్తిగానిదు శక్తిచే

కుశ:—పాతకిశఠుఁడ గాంచుమిదిగో క్రూరబాణముఁ బంపితిన్
క్షితినడలకు నీవు నరులన్ బ్రీతిఁజేయుము దానికిన్.

(ఇది అతిధృతియను ఛందంబునందు 185273 - వది.
శాతశర వృత్తము. నవీనము. భ, న, భ, య, జ, జ, గ, ఇవిగణములు.)

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శా | త | శ | ర | మి | ది | దీ | ని | గ | ను | మా | పై |
| 1 | 2 | 4 | 8 | 16 | 32 | 64 | 128 | 256 | 512 | 1024 | 2048 |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| చి | నిల్ | వు | మ | ధీ | ర | తన్ |
| 4096 | 8192 | 16384 | 32768 | 65536 | 131072 | 262144 |

(అనుచు బాణము ప్రయోగించి.)

యోధవరా! ప్రాణంబుపై నాశగలదేని రణము మాని పరుగిడుము.

శత్రు.—ఓరీ! బాలకా.

మత్తకోకిలవృత్తము. మానముం గల యోధుఁడెందును మానునే రణభూమినిన్
గానరా పనిమాన నీవిదె కండఁజెక్కెడు బాణమున్

కుశు.—[దానిని ఖండించి]

హీనబాణము నన్ను నంటునె యీయుదం బిఁక మానుమా,
మేను గాల్చెదు నారసంబిదె మేదినీధవ చూడుమా.

శత్రు:—మాటలేఁటికిఁ జాలింపు పటుతర మార్గణంబులు బంపితిన్
జేటుకలుగున్ నీకుఁ గనుమిదె చిచ్చుపెచ్చయి మేనునన్.

కుశుఁడు:—(వేఱొక బాణంబున దానిని ఖండించి.)

బూటకంపు బాణంబునను గనఁ బోలునే; యిదె గాంచుమా
గాటమగు కాఠిన్య శరమును గాయమెల్లను గాల్చెడిన్.

[నవీనవృత్తము. అతిధృతి ఛందమున 186320 - వ భయంకర వృత్తము. "భ, య, న, స, జ, జ, గ,"]



[బాణము వేయును. దానిని శత్రుఘ్నుఁడు ఖండించి.]

బాణవృత్తము. ఉష్ణిక్ఛందంబున 400 వ నూతన వృత్తము "నభగ"

శత్రు:—కదురుగ యుద్ధము
చెదరక చేయుము
ముదిఁగను శౌర్యము
ఇదెకను బాణము.

[అనుచు బాణము వేయును. దానిని కుశుఁడు ఖండించి]

ఉష్ణిక్ఛందంబున రణవృత్తము. 464 వది.

కుశు:—వదరకు పిరికీ
పదునగు శరమున్
గదియును నురమున్
వదలుము రణమున్.

[బాణము వేయును.]

సుప్రతిష్ఠఛందము 15 - వ గాథ వృత్తము. భగలగములు.

శత్రు:—పదకుర
కదలకు రా
చెదరకురా
యిదెగనరా

[అనుచు బాణము వేయును.]

ప్రతిష్ఠఛందము 7 వృత్తము భల్లము భగగ లగ).

కుశుఁడు:—(దానిని ఖండించి) భల్లమున్
చెల్లదిఁకన్
త్రుల్లక ; యీ
భల్లమునన్

[బాణము వేయును.]

శత్రు.—[నొప్పిచే దహాతపాతపడి దూరమునకు వచ్చి స్వగతము.]

ఈ బాలకుని బాణతీక్ష్ణత నాశరీరమునెల్లఁ దపింపఁజేసెను. వీనితో రణమొనర్చి జయమార్జించుట కష్టసాధ్యము. అట్టులని రణము వదలుట తగదు.

ఉ. బాలకుఁడంచు నమ్మితిని భావమునందునఁ గానఁ బూనితిన్
బాలుగఁ బ్రీతి నేనిఁకను జాల సహింపఁగ వీని బాణముల్
బాలున కింత శక్తి యెటు ప్రాప్తిలెనో? యిది తల్లిభాగ్యమో
మేలగు మౌనిశిక్షయొ యమేయ గిరీశ దయాతిరేకమో.

ఏమైనను గానిమ్ము. రణమొనర్చి జయమార్జించి సవనహాయమును గొనిపోవలయు ననునది యొకటి. యుద్ధావనిని నీబాలుని బాణధారచేఁ బ్రాణములు త్యజించుట మఱియొకటి. ఇవి రెండుదారులున్నవి. (ముందటికి వచ్చి ప్రకాశముగ.)

ఓరీ కుశా! నిన్నొక తృణముగ భావించి నాపరాక్రమంబుఁ జూపనైతిని. ఇదిగో నీ దుడుకుతనము నడికించి చంపుబాణము వేసెద. ప్రాణంబెటు కాపాడికొనియెదవో చూచెద!

కుశ.—ఓరీ! శత్రుఘ్నా! క్షీరసాగరభట్లను లోకోక్తికి నిదర్శనముగ నుండవలెనని కాఁబోలు నీతలిదండ్రులు శత్రుఘ్నుఁడని నీకు నామంబొసఁగినారు. నీవు రిత్తమాటలాడుచుఁ బ్రొద్దుపుచ్చుచుందువు. నీనాలుక తప్తమగు కుశతోఁ బవిత్రము చేయించెద. ఇదిగో కుశబాణంబు ప్రయోగించెద. పరాక్రమవంతుఁడవేనిఁ బ్రాణంబులు దక్కించుకొనుము. [అనుచు బాణంబుఁ బూన్చి.]

చం. గురువరు పాదసంస్మరణ గుప్తధనంబని యెంతునేని యా
పరమపతివ్రతామణినిఁ బాపవిదూరను సీతమాతనున్
గురుతరభక్తి దైవమని కోరి భజించుచునుందునేని యీ
శర మరిమై విరోధిబలసారము నెల్లను బీల్చుఁగావుతన్.

[అనుచు బాణము వేయ శత్రుఘ్నుఁడు హా యని క్రింద బడును.]

కుశుఁడు.—[సమీపించి గాలివిసరుచు లవునిఁ బిలుచుట] లవా! ఈయోధవరుఁడు కడునొచ్చి మూర్ఛపోయెను. సేన పాఱెను. నీవు



వేగమె వెళ్లి తల్లికి నమస్కరించి మోముఁ జూపి రమ్ము. నేనిచట నీహయమును యీయోధవరునిఁ గాపాడికొని యుండెద.

లవ:—అటులైన పోయివచ్చెద.

(నిష్క్రమము.)

## తురీయరంగము.

[శ్రీరాములు. భరత లక్ష్మణులు ఆంజనేయజాంబవంతులు మునులు భటులు.]

శ్రీరాములు:—సోదరులారా! నేఁటి ప్రాతఃకాలమునుండి నామదికి నెమ్మది లేకయున్నది. ఏనాఁడును లేని భీతి నామనమునందు నేఁడంకురించినది, కారణ మేమియో తెలియరాదు.

ఉ. వామవిలోచనంబదరె వామభుజంబిదె జల్దరించె నా
వామశరీర మెల్లను నవారిగనయ్యె వడంక సాఁగెఁ బో
రామి సహోదరుం డల తురంగము వెంటను సంచరించి యే
సీమను జేరి యేమయెనొ చింతకు నామది చిక్కె నక్కటా.

భరతుఁడు:—అన్నా! దైవస్వరూపులగు తమయనుగ్రహము సంపూర్ణముగ నుండ మనయనుజునకు నెవరినుండియు నేయపాయమును రాదు. మీచింతకుఁ గారణంబు లేదు.

లక్ష్మణుఁడు:—అన్నా! తమ కరుణాతిరేకంబున నాయనుజుఁడు క్షేమముగ నున్నవాఁడు. జాహ్నవీతీరము నిన్ననె చేరినాఁడట.

చం. సవనహయంబు వెంటఁ జని సర్వదిశల్ వడి సంచరించుచున్
బవరమునన్ ధరాధిపుల భాగ్యము నెల్లను సంగ్రహించుచున్
జవగతి నశ్వమున్ గొనుచు జాహ్నవితీర తలంబుఁ జేరె మా
లవణనిశాటహంత యని లంకెలు దెల్పిరి వార్త లన్నియున్.

కావున శత్రుఘ్నుఁడు క్షేమమున నున్నవాఁడనుటకు సంశయము లేదు. ఇంతలోన వచ్చును.

[భటులు ప్రవేశింతురు.]

భటులు.—స్వామీ ! రామభూపాలా ! తమపాదారవిందములకు వందనంబు లర్పించెదము.

లక్ష్మణుఁడు.—భటులారా ! వృత్తాంతమేమి ! మాశత్రుఘ్నుఁ డెందున్నవాఁడు.

భటులు.—(ఒకరిముఖ మొకరు చూచుచుందురు.]

రాములు.—ఏమీ ! భటులారా పలుకకయున్నవారు. శత్రుఘ్ని వార్త తెలుపకయున్నవారు.

భటులు:—స్వామీ !

భరతుఁడు:—ఏమిరా ! పలుకుదురా శిక్షింతునా.

భట:—[వడఁకుచు] స్వామీ ! శత్రుఘ్నుఁడు యుద్ధమున.

భరతుఁడు:—ఏమాయెను !

భటులు:—పడిపోయెను.

(అనుబంధము 26.)

రాములు:—హా ! శత్రుఘ్నా [అని చింతించుచుండును.]

భరతుఁడు:—భటులారా ! ఆవీరాధివీరుని శత్రుఘ్నుని జయించిన పరాక్రమవంతుఁ డెవఁడు !

భటుఁడు:—ఒక చిన్నబాలుఁడు.



లక్ష్మణుఁడు:—ఏమీ ! పసిబాలుఁ డొకఁడు శత్రుఘ్నుని నోడించెనా.

భటుఁడు:—వాఁడెచటి పసిబిడ్డ స్వామీ పరాక్రమవంతులపాలి యముఁడు.

భరతు:—భటులారా ! యుద్ధవార్త వివరముగ దెలుపుఁడీ.

భటుఁడు:—స్వామీ ! గంగానదియొడ్డున నరణ్యమున గుఱ్ఱము పోవుచుండ నొకబాలుఁడు పట్టి కట్టెను. మే మెదిరించితిమి, మాసేనను గెలిచి చంపెను. మాశత్రుఘ్నరాజు వచ్చి యాబాలునితోఁ బోరి తుదకు వానిని జయించి వానినిఁబట్టి తెచ్చుచుండెను. అంతలోనే పిడుగుబలె మఱియొకబాలుఁడు వచ్చి సేనను జంపి చెఱఁబడిన బాలునితోఁగూడ మనహయమును గొనిపోయెను. మన రాజు మరల యుద్ధమునకుఁ బోయి నిలిచి పోర నారంభించెను. ఘోరమయ్యెను పోరు. ఆపసిపిల్లవాఁడు తనబాణము పట్టి గట్టిగ విడువగా మనరాజు క్రిందఁబడెను. మొదటి పిల్లవాఁడు సేన నంతయును జెల్లాచెదరు చేసెను. చేయునది లేక బ్రదికినవారు మీసర్థనకు వచ్చితిమి. ఇంతయే మా వార్త.

రాములు:—[చింత నభినయించి.]

లావును లాఘవంబును బలంబును శాస్త్రవిచారవిద్యయుఁ
బావనమైన యస్త్రవిధి బాగుగ నేర్చిన సోదరుండు సం
భావితకీర్తియుతుఁ డొకబాలుని బాణహతి న్నశించెనే
దైవవిచేష్టితంబు లివి దప్పఁగ సాధ్యమె యేమి సేయుదున్. 153

లక్ష్మణుఁడు:—అన్నా ! రామభద్రా ! మనశత్రుఘ్నుఁడు ప్రాణంబుతో నున్నవాఁడు. మూర్ఛితుఁడయ్యెఁ గాఁబోలు. నాకు సెలవిచ్చిన

నేను శత్రుఘ్నునితోఁగూడ నాబాలకులను సవనహయమును దెచ్చెద. మీరు చింతింపకుడి.

అజ:—స్వామీ ! నే నున్నాను. తమపదదాసుఁడను. శత్రుఘ్నుని సరసకుంబోయి సంజీవకరణి సాహాయ్యమున నతనిని బ్రదికించి పిలిచికొనివచ్చెద.

రాములు:—లక్ష్మణా ! మనమెల్లరము వెళ్లుదము.

వసిష్ఠులు:—రామభద్రా ! నీవు దీక్షవహించినావు. బాహ్యసంచారంబు తగదు.

లక్ష్మణ:—అన్నా ! గోరంతపనికిఁ గొండంతగొడ్డలియా ? ఇట్టి చిన్న పనికిఁ దమరు రావలయునా ; ఆజ్ఞయొసంగిన నేఁ బోయివచ్చెద.

శ్రీరాములు:—లక్ష్మణా ! మంచిది. అటుచేయుము. నీకు శుభమగుఁగాత.

(నిష్క్రమును.)



పంచమరంగము.



లవకుశలు. లక్ష్మణుఁడు. సేన.

భటులు:—అల్లదిగో హయమువద్ద నిలిచిన బాలురే మనశత్రుఘ్న రాజును క్రిందఁబడవైచినవారు. ఈదిక్కు నగపడువాఁడు మొదట యోటుపడినవాఁడు.

లక్ష్మణుఁడు.—హా ! హా ! ఈబాలుర సౌందర్యము మానసాహ్లాదంబుగ నున్నది. అయిన నే నిపుడు కరుణమానినఁ గార్యము చెడును. సామవచనంబుల వారిని బోధించి చూచెద.



[అనుచుఁ గుశలవుల సమీపించి.]

బాలకులారా !

చం. తురగముఁబట్టి యీగతిని దుందుడుకుల్ సలుపంగఁ గాననాం
తరముల నుండు తాపసుల ధర్మమె ? బాలకులార ! వీఁడుఁడీ
గరువఁపుఁ బౌరుషమ్ము వృథ కా దొకొ విక్రమశూరవర్యులై
దురమున మీరె దుర్భటయు దోర్బలహీనుల కేల కయ్యముల్ ?

బాలకులారా ! మీరు బడుగు బాపనవడుగులు. వడిగలశరముల నడక లెఱుంగరు. తాపసవృత్తిమాని తామసవృత్తి నవలంబించుట ధర్మముగాదు.

కుశుఁడు:—యోధవరా ! మాటలవలన ఫలమేమి ?

ఉ. తాపసవృత్తియో నృపులతామసవృత్తియొ హీనవృత్తియో
బాపనవారమో చటుల బాహుజ వంశమువారమో మహా
చాపశరోరుశాస్త్రముల చక్కనెఱింగితిమో నెఱుంగమో
భూపతి యుద్ధరంగమునఁ బొందుగఁ గందువుగా నిజంబునన్.

యోధవరా ! మేము ధర్మము, శాస్త్రముఖంబున నెదిరించువారికిఁ జూపువారము. ధర్మశాస్త్రముల రీతులెఱుంగక పోడిమాటల వ్యర్థము నేల పల్కరించెదవు ?

లక్ష్మణుఁడు:—(స్వగ.) ఔరా ! ఈబాలుని నేర్పు. ఇంతటి పరిశుద్ధపరాక్రమవృత్తి మునిబాలురకుఁ గల్గుట దుస్తరము. నావదినె యవనీజాత సీత పునీత గర్భంబునఁ బుట్టిన పుణ్యపురుషులు వీరు. రాముల తేజంబు వీరియందు సంపూర్ణముగ నిండినది. [బాలకులనుజూచి ప్రకా.]

(అనుబంధము 27)

బాలకులారా! మీరు చిన్నవయసువారు. కావున మీరెఱుంగక పనులు సేయుచున్నవారు. ఈహయము పావనమూర్తియగు త్రిలోకవంద్యుఁడు రావణాంతకుఁడు పంపినది. వారి పరాక్రమ విక్రమంబులు జగద్విదితంబులు. వారితోఁ బోరుట సింగముతో బక్కనక్క పోరిన విధంబగు; పావనమగు సాత్వికవృత్తిని తపంబాచరించు మీకేల యట్టివారితో విరుద్ధము. రండి, నావెంట మీకు వలయునంత ధనము హేమాంబరంబులు మణిమయమందిరంబులు సకలలక్షణాన్విత గజ హయరథముల నిచ్చెద. సుఖముగ నుందురు గాని;

కుశుఁడు.—శూరవరా! మము నేల యిట్టియాశలకు గుఱిసేసెదవు. మీరు భాగ్యవంతులు కావున సర్వసౌభాగ్యము లమరినవి. మేమా బీదవారమై కానలో నివసించుచున్నాము. వారివారి యదృష్టానుసారముగ వారివారికి భాగ్యదారిద్ర్యములు కలుగుచుండును.

సీ. చామీకరాంచిత చంద్రశాలలు మీకు నేలనేర్పడు పర్ణశాల మాకు,
నవరత్నమణిమయ నవ్యభూషలు మీకు వెలగు రుద్రాక్షమాల మాకు,
భక్ష్యాన్నపాయసభక్షణంబులు మీకు కాయల కూరల కలిమి మాకు,
పసిఁడియంచుల జరీపంచు పంచెలు మీకు కట్టైన నారు వల్కలము మాకు.

గీ. భద్రగజహయరథభటబలము మీకు
సింహ శార్దూల మృగగణ సేన మాకు
వారివారి యదృష్టానుసారముగను
కలిమిలేములు కలుగును గాదె ధరణి.

యోధవరా! దారిద్ర్యమే తలభ్రాంతగ నున్న మాకు నీవిడు సౌభాగ్య మేమిప్రయోజనకారి యగును! వల దీమాటలు. నీవు వచ్చినకార్యంబు సలిపి నీయధిపువానతి నెఱవేర్పుము. కట్టిన సవన హయమును మేము ప్రాణముతో వదలము. త్రిమూర్తులేకమై



యాకారంబుగొని రౌద్రరసంబొలుకుచు సమరంబున నిలిచిరేని వారి నెదిరించి జయమార్జింతుము. మముఁ గన్నతల్లి వీరమాత యని లోక ఖ్యాతి కలుగునటు లొనర్తుము. ఇదియ మానిర్ధారము.

లక్ష్మణుఁడు.—[స్వగ] హా! హా! వీరు కేవల దైవస్వరూపులు. మా రాముల ప్రతిబింబాకారులు, ధీరులు. రణంబు మానరు. వీరి నెదిరించి రణము సేయకున్న నాసోదరుని యాజ్ఞఁ దిరస్కరించినవాఁడ నగుదును. కావున యుద్ధమొనరింపవలయును. తప్పదు.

శిఖరవృత్తము:—బాడబము నీవంటఁ జూచుట భవ్యమే గను బాలకా,
(28 ఛందంబగు ధృతి యందు 9257-వది శిఖరవృత్తము. భ-య-జ-జ-భ-రగణములు.)
కీడుగలుగుఁ జూడుమా యిఁకఁ గేలుమోడ్చుచు నిల్వుమా,
వాడిగల యీబాణ ముంపెద వాసవాదుల కైననుఁ,
మూడుమిగులఁ జేటు గల్గుర మూఢ నీ విది కానరా.

[అనుచు బాణము వేయఁ గుశుఁడు దానిని ఖండించి]

కుశుఁడు.—

రసనవృత్తము:—మాటుయీటెలఁ గార్యముగునే; మానుమా గరువంబు నీ,
(ధృతి యందు 926౨4-ది. ర-స-న-త-భ-య-గణములు)
బోఁటిమానిసి భూమినెందును బుట్టబోవఁడు నిక్కమూ,
నాటపాటలు గావు నమ్ముము యీలముందున నిల్వుమా,
యీటెపోటుల కాటు లంగము నెట్ల గ్రుచ్చును చూడుమా.

[అని వేఱొక బాణంబు వేయ]

లక్ష్మణుఁడు.—(లక్ష్మణుఁడు గాసిలి దూరంబున వచ్చి (స్వగతము.)

సీ. వజ్రకర్కశములై వాడితూపులు నాకు నెటులబ్బె బాలున కిట్టిపటిమ,
దర్భల నేకెడు దపసిబాలుర కెర యీశస్త్రసంధాన మెట్టు లమరె,
పాటవోద్భటము నావక్షఃకవాటంబు భేదించె నెటు బాలు విశిఖ వితతి,
సామాన్యమునిబాలు చందంబు గనుపింప దితనియందు నిదేమొ మాయ.

సీ. యరసి చూడఁగ రాముబాణానలంబు
నం దెసంగెడి కీలగా నమరెగాన
వీనియందింత రామాంశ వెలయకున్న
నిట్టిశక్తి చెలంగునే యెన్నఁడైన.

రజనీవృత్తము :—కరవారధారను గనుఁగొనరా
శరణన్నఁ బ్రోచెడు శర మిదిరా
ధరఁ దూలఁగూల్చును దడయకురా
నిరతోరు సౌఖ్యము నినుఁగనరా.

(అనుచు బాణము వేయఁ గుశుఁడది ఖండించి.)

కుశు.—

రజనీవృత్తము :—అరుదార దేహము నవియఁగనీ
(జగతి ఛందమునందు 2027-వృత్తము. ర-జ-స-స గణములు.)
శరవారముంపితిఁ జవిఁగొనరా
తరవారము న్విడు తగలకురా
నిరతోరు సౌఖ్యము నినుఁ గనురా.

(అనుచు బాణము వేయును. దానినిఁ దప్పించుకొని.)

లక్ష్మణుఁడు.—

నభోవృత్తము :—శూరవరులకు శూలముగన్
భూరిశరమిది పొందుగ, నిన్
దూరి కెడపును దుందుడుకుల్
చేరనీకనిను భీపదరా.

(అని బాణము వేయ దానిని ఖండించి.)

కుశుఁడు.—

నభోవృత్తము :—వీరరసమును నించిన యీ
(10-వ పంక్తియందు 447-వది భ-స-భ-గ-గణములు.)
నారసము నిదె యంపితిరా
యీరసమునను నంటుననిన్
చోరసముఁడవె పో వదరా.



[అనుచు బాణము వేయును.]

లక్ష్మణుఁడు.—

మాణవకవృత్తము :—అల్లదిగో నీశరమున్
ద్రుల్లకనేఁ దెంచితిఁబో
చెల్లవు నీ పౌరుషముల్
పిల్లలఁ జేరం జనుమా.

[అనుచు బాణము వేయ కుశుఁడు దానిని ఖండించి.]

కుశుఁడు.—

ఉ. మాతను సీతనున్ మదిని మానక యెత్తఁటిఁ దల్తునేనిఁ నే
నాతతభక్తి సల్పుచు నిరంతరమున్ గురుపాద పద్మముల్
నీతినిఁ గొల్తునేని హృది నిశ్చలవృత్తిని నుందునేని నీ
శాతశరోపఘాతమున శాత్రవుఁడందును మూర్ఛఁజెచ్చెరన్.

[అనుచు బాణము వేయ లక్ష్మణుఁడు మూర్ఛపోయి
క్రిందఁ బడును. లవకుమారుఁడు సేనను బరుగిడఁ జేయును.]

లక్ష్మణుఁడు.— (అనుబంధము 28)

కుశుఁడు.—[లవునిఁ జూచి] తమ్ముఁడా! ఈయోధవరుల నిరువురను గాపాడికొని యుందము. మరల సవనహయమును జాగరూకతో రక్షింతము. మఱి యేయోధవరుఁడు యుద్ధమునకు వచ్చునో చూతము.

లవ.—అన్నా! అటులనే యొనరింతము.

(నిష్క్రమము.)

# తురీయాంకము.

## ప్రథమరంగము.



శ్రీరాములు, ఆంజనేయులు, జాంబవంతుఁడు, సేన, లవ, కుశులు.

[అనుబంధము 29.]

శ్రీరాములు.—(లవకుశులను జూచి ఈబాలకులఁ జూచిన తటినుండి నామానసము వెన్నబలె మెత్తనై కరఁగుచున్నది. వీరిపై నేనెటు బాణములు వేయుదును? వీరి యాకారలక్షణంబులు చూచిన నాబలెనున్నవారు. ఆలనాఁడు నామోహనాంగిని సీతను నే నడవికిఁ బంపినపుడు గర్భము ధరించియుండెను. ఆపతివ్రతా గర్భంబునఁ బుట్టినవారు వీరుగానుందురు? కాదేని వీరికింతటి పరాక్రమ మెందుండి వచ్చును? ఆసతిని భూజాతను సీతను నీచుల మాటలు నిజమని నమ్మి యడవిఁ బడఁద్రోసితిని. ఆ ఘోరపాపంబు నన్నంటెను. నాసోదరు లిరువు రెందున్నవారో తెలియదు. వారినిఁ గోలుపోయి యుద్ధము నేనెటుమానుదు. ఈబాలకుల వృత్తాంతము నాకుఁ దెలియకయున్నది. వీరినిఁ బల్కరించి చూచెద. (లవ కుశులంజూచి) బాలకులారా! మీరెవరు? మీతలిదండ్రుల పేరేమి?

కుశ.—యుద్ధమునకు వచ్చిన మీకు మాతల్లిదండ్రుల ప్రస్తావమేల? ఎవరో పుట్టునిర్భాగ్యులమని యెన్నుఁడి. యుద్ధమునఁ బరాక్రమము



ప్రాముఖ్యముగాని కులగోత్రములు ముఖ్యములుగావు. అయినను మీవలన మేము దాఁపందగిన విషయ మేమియులేదు. కావున దెలిపెదము వినుఁడి.

సీ. దశరథు ప్రాకృత ధర్మార్థఫలముగ జనియించె నేమహాఘనుఁడు పుడమి,
యతిరయాగ రక్షణాయతమతిఁ జనిసీత నతిహితంబుగఁ బెండ్లియాడె నెవఁడు.
ఖరదూషణాదుల ఖండించి వాలిని హతుఁజేసె విక్రమాన్వితుఁడెవండు,
అబ్ధిని శిక్షించి యసురేశకులమెల్ల నాశనంబొనరించె నీశుఁడెవఁడు.

గీ. అట్టి జగదేక విక్రముం డవ్యయుండు
నాదిమధ్యాంత విరహితుం డమరవంద్యుఁ
డవని జాతను బరిణయమ్మగుచు మమ్ముఁ
గనియె శ్రీరాముఁడను మహాఘనుఁడు వినవె.

శ్రీరాములు — (అనుబంధము 30.)

(కన్నీరుఁ గార్చుచు) బాలకులారా! అట్టిఘనుని కుమారులు మీరు సుకుమారులు. మీరేల యీయడవింబడి యిడుమలఁగుడుచుచున్నవారు? వలదు. నావెంటరండు. మీకు గొప్ప పట్టణమున బంగారు మేడలుగల మందిరంబు లిచ్చెద. హయ గజ రథ భట చతురంగ బలమునిచ్చెద. సింహాసనారూఢులం జేసెద. మీరు సకల సౌభాగ్యము లనుభవించుచు సుఖమున నుండనగును.

లవ.—స్వామీ! సౌభాగ్య దౌర్భాగ్యములు వారివారి యదృష్టానుసారములై యుండును. మానవుఁడు తన కెంత యుండిన నంతటితో నే తృప్తిపడి యుండుట ధర్మము.

సీ. పర్ణశాలలు మునిపల్లెలు భవ్యమౌ పట్టణంబులు మాకునట్టడవిని,
శార్దూల పంచాస్య సారంగ మృగముల సేనమాకుండు నీ సీమలోన,
వింధ్యాద్రి హిమశైల వివిధనగంబులు విమలోరుసింహాసనములుమాకు,
శుక పిక శారికానికరనినాదముల్ ఘనశంఖకాహళధ్వనులు మాకు.

గీ. అడవిఫలములు భక్ష్య భోజ్యములు మాకు
బిరుసురు ద్రాక్షలే పైడి సరులుమాకు
పుట్టు బంగరములే మాకు భూరిమణులు
జనప భూమిని వదలంగా జననె మాకు

శ్రీరాములు.—(దుఃఖించుచు) తండ్రులారా! మీరతి బాలకులుగ నుండియు మముఁబోలు శూరుల నెదురించు చున్నవారే? మీకీ యడవిని నెవరు సాహాయ్య పడియెదరు.

కుశ.—స్వామీ! మాతల్లి దీవెన, మాగురువులగు వాల్మీకుల వారి పాదస్మరణ, యీరెండును మాకు నెల్లకాలములందును సాహాయ్య పడియుండును. భూతకోటి యెల్లను మాకుఁ దోడ్పడును.

గీ. నాఁడు మాతండ్రులిరువురు నాడువదలి
యడవి నిడుములఁ బడువేళ నగచరంబు
లన్ని వారికి సాహాయ్యమైనరీతి
భూతతతిమాకు సాహాయ్య భూతమయ్యె.

శ్రీరాములు:—[నిట్టూర్పు విడుచుచుఁ గూర్చుండును.]

కుశుఁడు:—ఏమండీ! యోధవరులారా! యుద్ధమునకువచ్చి కూర్చుంటిరి. ఇదియేనా మీ రొనరించు యుద్ధము.

శ్రీరాములు:—బాలకులారా! శరశరాసన కౌశలములేని మిమ్ముఁ బోలు పసికూనలతో నమఁబోలు పరాక్రమశాలి యెటు రణమొనర్పఁ దగునని యోజించు చున్నాను.

(అనుబంధము 31.)

కుశుఁడు:—స్వామీ! మీకా యోజనవలదు. మావంశపుఁ బెద్దలు చిన్నతనముననే తమ పరాక్రమముఁ జూపుచు యశమార్జించినారు.



గీ. మున్ను మాపెద్దలగువారు పిన్నవయసు
నందె పటువిక్రమాఢ్యులై యసురవరుల
గాలికిని దోలి ఋషుల యాగంబుఁగాచి
యశము నించిరిగాదె నల్దిశలయందు.

అటులనే మేమును బాల్యములోనె మాప్రతాపంబు వెల్లడింప యత్నించుచున్నాము.

శ్రీరామ:—బాలకులారా! మీపెద్దలకు విశ్వామిత్రులవారి సంపూర్ణానుగ్రహముండెను. వారివలన బాణవిద్య ప్రాప్తిను నార్జించిరి.

లవ:—మాకును వాల్మీకుల వారి శిక్షయయినది.

శ్రీరామ:—మీపెద్దలకు బాణ బాణాసన వైభవముండినది. అడవి నుండు వారికి నట్టిసంపద లెట్లుగలుగును?

లవ:—స్వామీ! చిన్నతనమునుండి మేము మునివృత్తి నవలంబించినాము. గనుక మానాలుక మంత్ర పూతమైనది. అకార్యకారణంబున మేము తృణముబట్టినను నది బ్రహ్మాస్త్రమై భాసిల్లును.

కుశు:—యోధవరులారా! మీరు యుద్ధమునకు వచ్చినవారా? కాదేని మాజనన వృత్తాంతమును, మాకుల గోత్రములును, మాసామర్థ్య రహస్యములును, దెలిసికొనుటకు వచ్చియున్నవారా?

శ్రీరా:—బాలకులారా! మిముఁబోలు బాలురతో యుద్ధమొనర్ప నాకు మనసు రాకయున్నది.

లవ:—అటులయిన మీదారి మీరు పట్టుడి.

శ్రీరా:—బాలకులారా! ఇంతకుముందు మీతో యుద్ధమొనర్చి క్రిందఁ బడిపోయిన యోధవరు లిరువు రెందున్నవారు?

కుశు:—మారక్షణమునం దున్నారు.

శ్రీరా:—అటులైన సంతోషము. మాసవనహయమును మాయోధవరులను మాకు నిచ్చినయెడల యుద్ధ ప్రసక్తిమాని మేము మా పురిఁ జేరుదుము.

లవ:—యోధవరుల నిత్తుముగాని సవనహయము నెన్నటికి నియ్యము.

కుశ:—ఆసవనహయలలాట ఫలకమునందలి బిరుదు మార్చువఱకు మేము దానిని వదలము.

లవ:—తన్నుఁగనిన కౌసల్యయే, వీరమాతయఁట. ఔరా! పౌరుషము. మమ్ముఁగనిన తల్లి భూజాత సీత వీరమాతకాదా! గొడ్రాలా! చూతము.

కం. వదలము పట్టినహయముఁ
గదలము కదనంబు ప్రళయకాలుఁ డెదిరినన్
బెదరము విక్రముఁ డెవఁడేన్
గదిసిన, యమపురముఁజేర్చి కాంతుము యశముఁ

ఇదియ మాదృఢ సంకల్పము.

శ్రీరాములు:—[స్వగ ఔరా వీరి పరాక్రమము] [ప్రకాశముగ] బాలకులారా! ఒకవేళ మీతండ్రియే మిము నెదిరించినచో నేమి సేయుదురు?

కుశ:—రణ ముఖంబున బాంధవ్యసంబంధ దాక్షిణ్యము లుండవు.

శ్రీరాము.—[దూరము జరిగి] "స్వగతము" ఇపుడేమి సేయుదును. సవనహయంబు పట్టువడెను. తమ్ములు చెఱఁబడిరి. పుత్ర వాత్సల్యమున యుద్ధము మానితినేని యపయశంబు సిద్ధంబు. తనపుత్ర ప్రేమచే చెఱఁబడిన యనుజనులను వదలెనని నాపినతల్లి సుమిత్ర నన్ను దూషించును. కావున నేను యుద్ధమొనర్పక తప్పదు.



[ప్రకాశముగ] బాలకులారా! మీముద్దుమోముఁ జూచి కరుణించి రణమువలదని బోధించితి. మీకది యహితంబై ప్రల్లదంబు లాడసాగితిరి. కావున రణ మొనర్తము.

లవు:—మేము నిశ్చయించిన దదియేను.

శ్రీరా:—శిఖావృత్తము:— మొండి తనమును విడిపింతున్
చండి మతమును వదలింతున్
రండి రణమున శరధారల్
నిండుఁగనుండిక నొదలెల్లన్.

పంక్తియందు 255-వ వృత్తము భ, న, గగణములు.

కుశుఁడు:— ఖండముయోఁ గను శరధారల్
మండి పడెఁగను మహిపై - మా
కాండ బలమును కనుఁగొమ్మా
భండనమునిఁక - విడపొమ్మా.

చూచితివా! యోధవరా! నీబాణము నడుమనే మండి క్రిందఁ బడిపోయెను. నాబాణము నీతను వంటెను.

శ్రీరా:—బాలకా! నెనరునఁ బూనినశరమది కావున నిష్ఫలం బయ్యె. ఇదిగో మఱియొక బాణముఁ బంపెద.

పుష్పహారవృత్తము. తొమ్మిదవదియగు బృహతియందు 219 వది ర, స, స గణములు.

కాలకంఠుని - కాంచనిచే
చాలదేహము - నంటునిఁకన్
కేలుమోడ్పుము - కాచనినన్
జ్వాలమాలలు - చాపునినున్.

(అనుచు బాణము వేయ నది పూలహారమయి కుశునికంఠమున శోభింపఁ గుశుఁ డచ్చెరువునంది లవునింజూచి.)

కుశ.—సోదరా! ఈయోధవరుఁడు మహానుభావుఁడని నాయంతరాత్మ నాకుఁ దెలుపుచున్నది. కావున బాణప్రయోగంబు లెన్నియేని

నితనియందు వ్యర్థమగును. సమ్మోహనాస్త్రంబు ప్రయోగించి తెలివి తప్పించెద.

లవ.—అన్నా! నాకును నదియే మేలని తోఁచెడు.

కుశ:—అటులైన నప్పని నొనర్చెద. (అనుచుఁ గుశుఁడు నొక శరముఁ గొని మంత్రించి వందనంబొనర్చి.)

మ. అవనీజాత, పునీతసీత, సతియై యా రామునర్ధాంగియై
ధవునిన్ దైవముగాఁగ, మానసమునన్ దా నెల్లకాలంబునన్
ధవుఁ గౌరింబలెఁ గొల్చి యుమ్మఁగనెనేన్, భక్తిన్ గురూత్తంసుసం
స్తవమున్ జేయుదునేని సిద్ధిఁగను నస్త్రంబిత్తఱిన్ బోరునన్.

(అనుచు సమ్మోహనాస్త్రంబువేయ, రామునితో సేన యంతయు నిశ్చేష్టితులై క్రిందవాలుదురు) (లవునింజూచి) సోదరా; యుద్ధ ప్రసక్తి నిలిచినట్లాయెను. మనమిఁక మనతల్లి దర్శనార్థంబు పోవలయును. ఇంత పని యొనర్చి రిక్తహస్తములచేఁ దల్లినిఁ జేరఁ బోవుట సమంజసముగాదు. కావునఁ బడిపోయిన యోధవరులం జేరి వారి వద్దనున్న యపూర్వ వస్తువులన్ గొనిపోవలెను. అవి వినోద వస్తువులుగ నుండవలెను.

లవ:—అటులనే చేయుదము.

(అనుచు సోదరులు యోధవరులఁ జూచుచు రాముల యంగుళీయకమును కంఠహారమునుఁగొని జాంబవంతుని నాంజనేయునిఁ జూచి.)

కుశ:—సోదరా! చూచితివే యీవృద్ధ భల్లుక రాజును భూరిదేహము గల యీకపిపుంగవుని.

లవ:—అన్నా! నిజము. వీరిరువురు చలించుచున్నవారు. నీయస్త్రము వీరిని బాధింపదు కాఁబోలు.



కుశ:—కావునవే వీరిని ఖిలిచికొని వినోద వస్తువులుగ మనతల్లికి నర్పింతము. (జాంబవంతునింజూచి) ఏమీ! భల్లూక భట్టాచార్యులవారూ, లెండి మావెంటరండి. (అనుచుఁ జెవులు బట్టి యెత్తును.)

లవ:—(అంజనేయులంజూచి) ఏమండీ! కపివర్యాచార్యులవారూ! లెండి, మావెంట రండి.

(అనుబంధము 32.)

(అనుచు నీడ్చుకొని పోవుదురు.)

(నిష్క్రమము.)

ద్వితీయరంగము.

సీత. లవ. కుశ. వాల్మీకి. ఆంజనేయులు. జాంబవంతుఁడు.

(అనుబంధము 33.)

సీత:—హా! దైవమా, నాచిన్నికొమారులు రణావనిఁజేరి యెనిమిది దినంబులయ్యెను. వారిక్షేమంబు తెలియదాయె.

ఉ. అనుజునిఁ దోడితెత్తునని యక్కట వెచ్చఁ గుశుండు పోయె, నా
యనుఁగు కుమారు లిర్వురు రణావనిఁ జిక్కిరొ శాత్రవాళికిన్,
గనికరమెన్న కా రిపులు కాటియలన్నిడి యేమి సేసిరో,
మనముఁ గలంచు దుఃఖమెటు మాన్చను సేయుదు నేమి దైవమా.

హా! దుర్భర మీదుఃఖము. ఇవుడు నేనేమి సేయుదును; నేను నాకుమారుల కిచ్చిన దీవెనలన్నియును రిత్తపోయె. సార్వకాలము లందును నాకుమారులను రక్షించుచుండుఁడి యని, వనదేవతలను వేఁడి

నది వచ్చుచున్నది. పట్టరాని యీచింత నే నెటు భరింతును. నాకెన్నఁడేని నిట్టి దుర్భర వ్యసనంబు నామనంబును గలంప లేదుగదా ?

సీ. నిండుసంపదవీడి, కొండవీడులనుండు తఱినైన వెసనంబుఁ దగులదయ్యె,
మాయల రావణు మందిరంబునుజేరు తఱినైన వెసనంబుఁ దగులదయ్యె,
ప్రాణనాథుని నెడఁబాసి దీనతఁగుందు తఱినైన వెసనంబుఁ దగులదయ్యె,
అపనింద పాలయి విపినంబుఁజేరిన తఱినైన వెసనంబుఁ దగులదయ్యె.

గీ. ఏమికత మొక్కొ మానస మేర్పు చింత
మిక్కుటంబయ్యె నిత్తఱి, మేనువడఁకె
దైవమా ; చిన్ని బిడ్డల దయనుబ్రోవ
శరణు వేఁడెదనయ్య యీతరుణమునను.

ఇప్పుడు దుఃఖించి నేనేమి సేయఁగలను ? చూచి రమ్మని ముని కుమారుల నెవ్వరినైనను బంపుదునా? పిల్లవారెవరు నిచట లేరుకదా; నేనై యుద్ధావనిఁ జేరి వెదకవత్తునా ? క్రూరాత్ములు. కఠినచిత్తులు. దుర్నీతిపరులు యుద్ధభటులు నన్నుఁగని యేబాధ లిడుదురో కదా ? హా. దైవమా.

చం. ఇలపయి నాఁడు పుట్టువుగ నేలజనించితొ ? చండభాను స
త్కులజుని రామభూవిభుని తోరపు దారఁగ నేల మించితో
యెలమినిగర్భమేల ధరియించితొ గట్టిగ గొడ్డు గాక, యీ
విలసిత మూర్తులన్ సకలవేత్తుల పుత్రుల నేల కంటినో.

ఏమో ! కడుపునందు గోలిడి కలిపినటుల సంకటమగుచున్నది. నే నిలువఁజాల. మనఁజాల [అనుచుఁ గ్రిందఁబడును.]

[లవ కుశులు ప్రవేశించి సీతనుజూచి యచ్చెరువందుచు.]

కుశుఁడు:—సోదరా ! మనతల్లి యేల నేలఁబడినది ? మనలఁబల్కరింపదు.

లవ:—కారణ మేమో నాకును దెలియదు.



కుశుఁడు:—నేఁ బల్కరించి చూచెద.

కం. మాతా, సుగుణ సమేతా
సీతా ! భూజాత, లెమ్ము శీఘ్రమ్ముగ, వి
ఖ్యాత యశులగుచుఁ బుత్రులు
చేతో మోదంబొనర్పఁ జేరిరినిన్నున్.

లవ:—కం. సీతా ; యవనీజాతా
మాతా ! యిదియేమి చిత్రమమ్మా ; సుతులన్
బ్రీతినిఁ గన్నులఁజూడక
యీతఱి సొంపఱుచు భువిని నేలబడితివో.

అమ్మా ! జానకీ ! నీపుత్రులమగు మేము జయమార్జించి తెచ్చి నీదర్శనమునకు వచ్చితిమి. [అనుచు శైత్యోపచారములు సేయుదురు.]

సీత:—[మూర్ఛఁదెలిసి పుత్రులనుజూచి] కుమారులారా ! క్షేమముగ వచ్చితిరా ? జయమార్జించితిరా ? [అనుచుఁ గౌఁగిలించుకొని ముద్దిడి] నాయనా ! మీరెనిమిది దినములైనను రాకైతిరి. నాకు కేల్మంబవలును దుశ్శకునములు బలమాయెను. నన్నాదరించువారీ భువిని మీరుదప్ప మఱియెవరును లేరు. గావున మీ కేద్దియో యపాయము సంభవించెనని దుఃఖించుచుఁ బడితిని. పుత్రులారా మిమ్ము యుద్ధావనిని నెదిరించిన వారెవరు ?

లవకుశులు.—తల్లీ ! వారెవరైనది తెలిపెదము వినుము.

[అనుబంధము 34.]

లవ.—అమ్మా ! వారి కులగోత్ర నామములు మాకుఁ జక్కఁగ దెలియవు. ఎవరితో రణమొనర్పఁ బూనినను రాక్షసాంతకుని యోధవరులని తెలుపుచుండిరి. యుద్ధ సంభ్రమమున వివరము లెఱుంగ మా కనుకూలంబు గాదయ్యె.

కుశుఁడు:—యోధవరులను నందఱిని నవలీలగ జయించితిమి. తుదకు మాతో యుద్ధమునకువచ్చిన మహానుభావుఁడు దైవస్వరూపుఁడుగ నాకంటికి గపడుచుండెను. అతని బాణములన్నియును నాకంఠమునఁ బూలహారములై వెలయుచుండెను.

సీత:—పుత్రా! అతఁడెటు లుండెను?

కుశు:—అమ్మా! మేఘశ్యామలవర్ణుఁడు. విశాల వక్షమును విశాల నేత్రములును గల వాఁడు. ఆజాను బాహువు.

సీత:—ఆమహాను భావుని మీ రెదిరించితిరా?

కుశు:—అమ్మా! ఎదిరించి యతనిని నొప్పింపఁజాలక సమ్మోహనాస్త్రమున గ్రిందఁ గెడపితిమి.

సీత:—[హా! హా! అనుచుఁ గ్రిందఁబడి] కుమారులారా! పితృహంతలు మీరు.

[అనుబంధము 35.]

కుశు:—అతఁడు మాతండ్రియా! చూడనిదే నీవెటు లూహించితివి.

సీత:—పుత్రా! నీవు బలుకు సాముద్రికా లక్షణములుగల పురుషుఁ డతఁడొకఁడు దప్పఁ బ్రపంచంబున మఱియెవరును లేరు.

కుశ.—అమ్మా! నీయూహ నిజమో కాదో చూడుము. ఆమహా మహుని చేత నీయంగుళీయకముండినది.

సీత.—[చక్కఁగఁజూచి కన్నుల నొత్తికొని కన్నీరుగార్చుచు యంగుళీయకము చేత నిడుకొని.]

సీ. అలనాఁడు చింతచే నవియుచుండినతఱి నంగుళీయకము నన్నాదరించి,
యానంద సాగరమందుఁ దేల్చితివిగా యిపుడేల నన్నిటు విపులదుఃఖ,
వారిధిలోముంచి తీరమునకు బహు దూరమందున విడిదూఱు వడితో,
విభుని కేలుననుండివే వెలుఁగులరీతి వెలయు చుందువుగదా వేళవేళ.



గీ. ప్రాణనాథుని, నిపుడెడఁబాసి నీవు
వచ్చితివె నన్ను వ్యసనమున్ వార్ధిఁద్రోయ
నేమి సేయుదు బ్రదుకుదు నెటుల భువిని
నుంగరమ నాదు విభు ముద్దుటుంగరమ్మ.

హా! హా! నాథా! ఇఁక నాజన్మంబు వ్యర్థము. నేను నీకు దారనై యనేకవిధములఁ గష్టములఁ బెట్టితి. అపనిందల పాల్పఱచితి. నావిభుఁడు నన్ను విడనాడి, పోనాడి కానలలోఁ బడద్రోసెనని యొక నాఁడయినను నిన్ను నే దూషింపవెఱచితి. నావిభుఁడు చల్లగనుండ నామాంగల్యంబునకుఁ జాంచల్యము రాదని యెంత కష్టపడు చుండినను దానిని నే సరకు సేయనైతిని. నాథా! నవుఁబోలు నిర్భాగ్యకు మాంగల్య సౌభాగ్యమైన నేలయుండవలెనని తలంచి కాఁబోలు నీవిపుడు నేలంబడితివి. ఇఁక నేమని యేమి ప్రయోజనము.?

కుశు:—అమ్మా! ఆమహానుభావుఁడు నాసమ్మోహనాస్త్రబలంబున స్మృతిచెడి నేలఁబడెనుగాని వేఱొక యుపాయంబుఁ గనఁడు. నీవేల చింతించెదవు?

సీత.—కుమారులారా! ఆ దేవదేవుఁడు మహానుభావుఁడు బ్రదికి యుండినఁ జాలు. నాకు నదియే పదివేలు.

లవ.—మాతా! నీ వినోదంబునకని యొక భల్లుకము, నొక కపిపుంగవునిఁ దెచ్చినాము. వారినిఁ బిలిచికొని వచ్చెదను. వలయునేని నీవు చింతించు విషయము వారిని విచారింపనగును.

సీత:—ఏమీ! ఆంజనేయులు జాంబవంతుఁడు వచ్చియున్నవారా.

లవ:—వారి నామము లేమో మాకుఁ దెలియవు. నాయన్నయ్య సమ్మోహనాస్త్రమునకుఁ జిక్కక వెలివడినవారు వారిరువురేను.

సీత:—కుమారులారా! వారు పురాణ పురుషులు. దైవ వరబలులు. మీతండ్రిగారి భక్తులు. వారిని శస్త్రాస్త్రము లెవ్వియు బాధింపవు. ఏదీ వారినిఁ బిలిచికొనిరండు. నావిభుని క్షేమంబును గుఱించి విచారించెద.

లవ:—(పోయి జాంబవంతుని నాంజనేయులను బిలిచికొనివచ్చి సీత సరసవదలి) అమ్మా. వారు వీరేను.

ఆంజనేయుఁడు:—(సీతకు నమస్కరించి దండకము చెప్పును.)

సీ. శ్రీమహాలక్ష్మీదేవి శ్రీరామ విభుదేవి సీతా మహాదేవి చేతునతులు,
నిత్యోరుకల్యాణి నీలనీరదవేణి నీరేజనిభపాణి నీకునతులు,
వాస వాభ్యుదయద వాచంయమి శ్రీద వాగీశనుతపాదవందనములు,
సజ్జనావనశీల సంయమీశ్వరపాల సద్గుణ జాల సాష్టాంగనతులు.

గీ. కనకసుమనాస సత్స్మాదకరవిలాస
విబుధమందార శృంగారవిభవ పూర
నుతగుణ విశాల సత్కృపోన్నత విలోల
తల్లి సాధ్వీమతల్లి వందనములిడెద.

[అనుచు వందనంబు లిడును.]

సీత:—శ్రీరామ భక్తులారా! నావిభుఁడు క్షేమమున నున్నవాఁడా!

అంజ:—తల్లీ! ఆదిదేవునకు నపాయము సంభవిల్లునా.

ఉ. దైత్య వధార్థమై ధరను దైవము మానవజన్మమెత్తి యా
దిత్య కులోద్భవుండునయి ధీర పరాక్రమలీల రావణుఁ
మృత్యువు నోటనుంచి దయమేదినిఁగాచిన యాదిదేవునిఁ
నిత్యుని, రామచంద్ర ధరణీధవునంటునె మృత్యు వెందునుఁ.

తల్లీ! నీమానస మందలి యనుమానంబు వదలుము. నీవిభుఁడు మానవ జన్మమెత్తిన కారణమున మహిని మనుజుని బలెవర్తింప, నీ సూనుల సమ్మోహనాస్త్రంబునకుఁ జిక్కినాఁడు.



[వాల్మీకులనారి ప్రవేశము.]

వాల్మీకి:— [అనుబంధము 36.]

వృత్తము. రామరామ రఘురామ, జానకీరామ విరోధివిరామ, రమా
రామరాజ దశిరామ యాశ్రితారామ పునీతసునామగుణ
స్తోమధామనుత నామరూపజి, తోసమకామని భీమదృఢ
స్థేమ, శామ, మునిలోక శ్రేయస్సంసీమ శుభావహనామ, భజే.

[సీతనుజూచి] అమ్మా! జానకీ; చింతింపవలదు. ఊఱడిల్లుము. నీ వ్యసన కారణంబు నారదఋషి తెలిపెను. వెంటనె మనోవేగమున వచ్చితిని. లెమ్ము. యుద్ధావనికిఁ బోవలయును. ఆలస్యమున కిది కాలంబుగాదు. ఈపురాణ పురుషులు జాంబవంతుఁడు, నాంజనేయులు మన వెంటవత్తురు. [లవ కుశులంజూచి] బాలకులారా, మీరును నావెంట రండు.

సీత:—తమ యానతి రీతి వర్తిల్లుదుము.

(నిష్క్రమింతురు.)



తృతీయరంగము.



రామ, లక్ష్మణ, శత్రుఘ్నులు. సీత, లవకుశులు. వాల్మీకి, ఆంజనేయులు, జాంబవంతుఁడు, విభీషణుఁడు. శూర్పణఖ, మంథర. ముని శిష్యులు.

వాల్మీకి:—[మూర్ఛబోయిన రామ లక్ష్మణ శత్రుఘ్నులఁజూచి నీరు ప్రోక్షించి కుశునిఁజూచి] కుశకుమారా; నీ సమ్మోహనాస్త్ర ప్రయోగమున నీతండ్రిగారును పినతండ్రులును వారిసేనయు విక

శత నందియున్నవారు. కుశల నీవే శుభసూచకంబగు నస్త్రబలంబున దాని నుపసంహరింపుము.

కుశ:—[గురూత్తమా! తమ యానతి శిరసావహించి చేసెద. అనుచు నొక గడ్డిపోచ చేత నిడుకొని.]

చం. రవికులవంశభూషణుని రాముని పుత్రుఁడనైతి నేని భూ
ధవుని, మదంబ సీత, మదిదైవము గాను, దలంచితేని, బాం
ధవ నికరంబుతో జనకుఁ డిప్పుడె తప్పక లేచుఁగాత, వై
భవతతలక్షణాన్విత శుభంకర విగ్రహుఁడై కృపాళువై.

[రామ లక్ష్మణ శత్రుఘ్నులు భటులతో లేచి నిలుతురు.]

రాముఁడు:—[వాల్మీకినిఁ జూచి.]

ఉ. మానిత మౌనికాణ్ణికరమానసహంస కృపావతంస; య
జ్ఞానతమోవినాశ, విగతోర్జిత సంసృతిపాశ, యీశ, నే
భానుకులోద్భవుండ, మునిపాద సరోరుహషట్పదుండ, స
మ్మానముగా నమస్కృతుల, మానుగఁ జేయుదు నేను రాముఁడన్.

(అనుచు నమస్కరించును.)

వాల్మీకి:—దీర్ఘాయురారోగ్యమస్తు; రామచంద్రా లెమ్ము. ప్రాకృత మనుజులంబోలె నీవు నటింపఁదగునా? నిన్ను నీవు మఱచితివా.

సీ. సంభవిల్లును సృష్టి సకలంబు నీయందె సర్వంబు నీయందె జడత నడఁగు,
శూన్యమై నిలుతువు చూడ నొక్కొకవేళఁ జూపుదు వొకవేళ రూపకారఁ,
నిర్గుణత్వముఁ బూని నీవు లేదందువు సగుణుఁడవై యునికిఁ జూటఁ దలఁతువు,
ధాధార భూతమై యన్నిట నుండియు, నాది మధ్యాంత శూన్యత వహింతు.

గీ. మూఢు రూపములను బూని మూఢ జనుల
మోహమునఁ ద్రోసి యవ్వలిమూర్తి వగుచు
ప్రకృతి వికృతుల రెంటిని బాఱఁద్రోలి
వెలయుచుందువు తేజంబు వెలుఁగు రీతి,



రామచంద్రా! నీవాది దేవుఁడవు. రాక్షసవధార్థ మిలాభువి జనించితివి. లీలా మానుష విగ్రహుఁడవైతివి.

శ్రీరా:—మునికులావతంసా! నీ సరసనుండు బాలురెవరు?

వాల్మీ:—రామచంద్రా! లోకవిడంబనార్థము, భర్తకటికచిత్తుఁడై నిండుగర్భమున నుండుదారను పతివ్రతాశిరోమణిని, లోకాపవాద నివారణకై, నట్టడవినిఁ ద్రోయింప, నాసతిని నాకన్న బిడ్డగఁ బెంచితి. ఆసతీమతల్లిగర్భమునందు దుద్భవించిన బాలురు వీరు. సకలవిద్యల నాచే శిక్షింపఁబడిరి.

శ్రీరా:—మహానుభావా! ఆసతీమణి యెవరు? ఎందున్నది.

వాల్మీ:—ఆ పురంధ్రీమణి యాదిలక్ష్మి సీత రూపంబున నయోనిజయై సీత యను నామంబు వహించి దశరథుని కోడలాయెను.

శ్రీరా:—(తలవంచికొని) మునిపుంగవా! ఆసతీమణి, యుపపాదము పాల్వడెను గదా.

విభీషణుఁడు శూర్పణఖను బట్టికొనివచ్చి నిలిపి రాములను జూచి.

విభీష:—

గీ. శరణ దాసుఁడ, శ్రీరామ చక్రవర్తి
శరణు శరణంటి దీనపోష ప్రవర్తి
కేలు మోడ్చెదఁ ద్రిభువన గీతకీర్తి
వందనంబులు రఘుకులానందమూర్తి.

(అనుచు నమస్కరించును.)

శ్రీరా:—విభీషణా! హృత్తోషణములగు నీ కలభాషణములు మానసాహ్లాదంబుగ నున్నవి? దితికులోత్తమా! నీ విపుడిచటికి వచ్చిన కతంబేమి?

విభీష:—పరంజ్యోతిరూపా! భువిని సర్వపాపంబు లాకారముఁగొని శారీరూపములను ధరించి సంచరించుచుఁ బుణ్యపురుషుల సుఖములపాలిమారులై యున్నవారు వీరు. వారి పాపచరితంబులు నేను నోట నుడువఁజాల. సర్వ ప్రపంచపాలకులగు తమరే వీరిని విచారింపవలెను. వినఁ నసహ్యములగు నపవాదంబులు భూజాతయగు సీత విషయమునఁ బుట్టించినవారు వీరేను.

శ్రీరా:—అచ్చెరువందె, అదియెటుల విభీషణా! వివరముగఁ దెల్పుము.

విభీషణుఁడు:—(శూర్పణఖను ముందటికి నీడ్చి) భక్తవత్సలా! ఇది నాసోదరి. పాపాత్మురాలు ప్రారంభమునునుండి. తమ సుఖభంగమునకు నీపాతకి యొనరించిన దుష్టకృత్యములు నుడువనోప. రావణ సంహారం బొనర్చిన పిదప సైత మీదయ్యము తమ వెంటనంటి బాధించుచున్నది. దీనికి మీదాసి మంథర సాహాయ్యపడినది. ఎటుల వీరిరువురు తమ్ము బాధించినది తమరే విచారింప నగును.

శ్రీరా:—(ఆంజనేయునిఁ జూచి) భక్తాగ్రేసరా! వీరిని విచారింపుము.

ఆంజ:—చిత్తము. [అనుచు శూర్పణఖ చెవులుబట్టి యీడ్చుకొనివచ్చి ముంగిటనిలిపి శూర్పణఖను చూచి] శూర్పనఖా! నిజము పలుకుము. ఇదిగో బ్రహ్మాండదము [వాలముఁ జూపును. శూర్పణఖ వడవడ వణఁకును.] ఇంచుక యబద్ధముఁ గలిపితివేని నీమేనుఁ జీల్చి యుప్పునించెద.

శూర్పణఖ:—(వణఁకుచు) అయ్యా! వాలము ముడిచికొనుము. నిజము పలికెదను.

ఆంజ:—త్వరలోఁ గానిమ్ము.

శూర్పణఖ:—స్వామీ! మీముఖ మవతలఁ ద్రిప్పినచో నాకు మాటలు వెల్లును.



ఆంజ:—అటులనే యొనరించెద. కానిమ్ము.

శూర్ప:—(లక్ష్మణునిఁజూచి) తమ చేతనుండు కత్తిని క్రిందవైచినచో నిజము పలికెద (అనుచు ముక్కు చెవులు బట్టుకొనును.)

లక్ష్మణుఁడు:—[కత్తివదలి] కానిమ్ము.

శూర్పణఖ:—అయ్యా! అలనాఁడు దండకాటవిలో మీరుండునపుడు మిముఁ గామించితిని? సీతను జంపి నేనే భార్యగ నుండఁదలంచితిని. నామాయలు దెలిసి నన్ను మీరు వికారరూపిణిగా నొనరించితిరి. ఆపగ నాపఁగ జాలక నాయన్నకుఁజెప్పి సీత నపహారింపఁ జేసితిని. రావణునిఁజంపి మరల సీతను మీరు దెచ్చికొంటిరి. మీపై నాకుఁ బగ హెచ్చాయె. పిదప మీవెంట నగోచరముగనంటి మీ సుఖభంగమునకు దారి వెదకుచుంటిని. ఈమంథర సైతమదే యుద్యోగమున నుండినది. మా యుభయుల యర్థంబు లేకమై నందున మాయత్నంబులు ఫలింపఁ జేసికొంటిమి.

ఆంజ:—అది యెటుల

శూర్ప:—ప్రారంభము మేమిరువురము సాకేత నగరమునందలి నీచజాతివారింగూడి సీత వ్యభిచారిణియను కింవదంతి కలిగించితిమి. పిదప నేను మంథర సాహాయ్యమున సీత దాసివేషమును ధరించి గూఢచారిని లోఁబఱచుకొని రావణుఁడు సీతనుఁగూడి నట్టుల చిత్రలేఖను లిఖించి యొకానొక రాత్రి సీత తలగడక్రింద నాచిత్రలేఖ నుంచితిని. గూఢచారి తెలిపిన సమాచారంబువిని మీరు నన్నడిగినపుడు రావణుని పటముఁజూచుచు జానకి పరితపించుచుండునని సాక్ష్యమిచ్చితిని. పిదపఁ గాఁదగిన యనర్థములన్నియుఁ గలిగెను. నేను సంతసించి లంకాపట్టణంబున నాసరివారితో జరి

గిన వృత్తాంతమెల్లఁ దెలుపుచుంటిని. ఆసమాచారంబు విని విభీషణుఁడు నన్నీడ్చుకొని వచ్చెను.

శ్రీరా:—(దుఃఖించుచు) ఆంజనేయా! వీరిరువు రతిపాపాత్ములు నిష్కళంకయగు సీతపై నింద మోపిరి. వీరు నాయెదుటనుండ నర్హులుగారు. వైళంబ నాయెదుటనుండి తొలఁగింపుము.

[భటులు వారిరువుర నీడ్చుకొని పోదురు.]

[వాల్మీకులంజూచి] మునికులాగ్రణీ! సీత విషయమున నే నొనర్చిన యపరాధంబు ప్రాయశ్చిత్తానర్హమైనది. ఆసతీమణి నిష్కళంక మతిని నడిమించిన పాతకిని నన్నుఁగనులెత్తి చూడ నాజానకి నా మోహనాంగి యసహ్యపడును గాఁబోలు.

వాల్మీకి:—ఆదిదేవా! మరల నీవు ప్రాకృత మనుజునిఁబోలె నజ్ఞాన జనిత ఫలంబుగ విమోహంబులోఁ బడితివి. ఆపతివ్రతా శిఖామణిని నిచటికిఁ బిలిచికొనివచ్చినాను. ఆజ్ఞ యిడిన తమ సన్నిధానంబునకుఁ బిలిచికొని వచ్చెదను.

శ్రీరా:—మునికులాగ్రణీ! అంతటి పుణ్యమా! అది నాభాగ్యమని తలంచెద.

వాల్మీకులుపోయి వెంటనె సీతను బిలిచికొనివచ్చును. సీత తల వంచుకొని కన్నీరు గార్చుచుండును. దానిఁగని శ్రీరాములు సీత కేలుఁబట్టి.)

శ్రీరా:—సీ. అపనిందలనునమ్మి యపరాధినైతిని యంతిరోసను క్షమియింపుము క్షమియింపుము,
సీత:— క్షమియింపఁ గోపింప స్వాతంత్ర్యురాలనే యబలను పతివశనైనదాన,
శ్రీరా:—జడజాక్షి నిన్ను నే జడుఁడనై నడికానలందిడిన క్రూరుఁడఁగానె యుందువన,



సీత:— పడఁతికి బతియాజ్ఞ పాశబంధము గాదె దీనికి నేను చింతింపనాథ,
రాము:— నిండుగర్భంబున నుండు నాతినినిన్ను కరుణా విహీనుఁడై కానలిడితి,
సీత:— ప్రాకృత కర్మానుఫలముఁ దప్పింపఁగ వశమె యెవ్వరికైన వసుధలోన,
శ్రీరా:— పసిబాలురను గూడి పసచెడి యడవిని గడుకష్ట ముందితే కాంత నీవు,
సీత:— గతమునకేల యీఁగతినిఁ జింతింపఁగఁ బ్రస్తుతగతి మాకుఁబరమసుఖము.
శ్రీరా:—గీ. బాలురడవినిఁ గష్టముల్పడుచుఁ జిక్కి
నన్ను నెంతగ శపియింప నున్నవారొ
సీత:— యతికులాగ్రణి వాల్మీకి యతిశయకృప
గష్టమెద్దియుఁ గనరాదు గాదె నాథ.

శ్రీరా:—మానినీమణీ! నినుఁబోలు సతీమణి సుగుణంబు లోకాపవాద నివారణార్థము సందియించి కష్టముల పాల్పడితివిగాని నిజముగ నీ పాతివ్రత్య మహిమను నే సందియించినవాఁడను గాను. సతీమణీ! మనబాలురు వాల్మీకుల వారి కృపాతిరేకంబున శస్త్రాస్త్ర విద్యల నిపుణులై నన్ను మఱపించిరి. ఇది నామదికి సమ్మోదకరముగ నున్నది. ఈమహానుభావుల మహిమాతిశయంబున వీరేయే విద్యలు నేర్చిరో తెలియఁ గోరెద.

వాల్మీకి:—మహానుభావా! నీ కుమారులు వేదవేదాంగములెల్లను నేర్చిరి. నాచే రచియింపఁబడిన తమచరిత్ర, రామాయణము వీణెపై వాయింప నేర్చిరి.

శ్రీరా:—గుణోత్తంసమా! ఏదీ, వీనుల తనివార వినెదను. రెండు శ్లోకములు చెప్పింపుము.

వాల్మీకి:—[లవకుశులంజూచి] బాలకులారా! వీరు మీతండ్రిగారు. వారికి మానసాహ్లాదంబుగ రామాయణమందలి కొన్ని శ్లోకములఁ బాడుఁడి.

కుశుఁడు. చిత్తము. గురువరా!

శ్లోకం. సాకేతే శరదిందు కుందధవళే సౌధే మహామంటపే
పర్యస్తాగరుధూప దీపలలితే కర్పూర దీపోజ్జ్వలే
సుగ్రీవాంగద జాంబవత్పరివృతం సౌమిత్రిణా సేవితం
లీలా మానుష విగ్రహం రఘువరం రామం భజేశ్యామలం

లవ:—నమోస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యైచ తస్యై జనకాత్మజాయై
నమోస్తు రుద్రేంద్రయమానిలేభ్యో
నమోస్తు చంద్రార్క మరుద్గణేభ్యః.

లవకుశ:—శ్రీరామ చంద్రశ్రిత పారిజాతః
సమస్త కల్యాణ గుణాభిరామః
సీతాముఖాంభోరుహ చంచరీకో
నిరంతరం మంగళమాతనోతు.

శ్రీరాములు:—(బాలురను గౌఁగిలించుకొని.)

హా! హా! ఈబాలుర వాక్యములు ముద్దుగుల్కుచు దేనియ లొల్కుచు మహానంద వారిధిని ముంచి తేల్చుచున్నవి.

కం. భూషణములు వీనులకును
తోషణములు మదికి, భూరి దురిత స్తోమ
ప్రేషణములు, పసిబాలుర
భాషణములు, మధుర రుచిరభక్ష్యములగుచున్.

ఇట్టి బాలుర ముద్దుపలుకులు చిన్నతనమునుండి వినుభాగ్యము నాకు లేదాయె. హా! హా! కన్నులారఁ దానుగనక పరుల నిందలను నమ్మి తన దారను వదలిన మూర్ఖుఁడీ జగతి దుఃఖముల పాలై చెడును గదా!

ద్విపద. పరుల నిందలు నమ్మి భార్యను వదలు
నరున కీజగతిని నరక మేర్పడును
నీచుల వచనమ్ము నిజమని నమ్మి
యాచంద్రవదననే నేఁచితి మిగుల



యిడుముల జగతిని జగజంతలయిన
పతులు పగసైన పనియైనఁ జేయఁ
దలపెట్టుచుందురు ధర్మంబువదలి
కులసతులను రచ్చకును దెత్తురలమి
కావునఁ బురుషుండు కానకయెద్ది
భావంబునను నమ్మి భార్యను వదల
భోగ భాగ్యములెల్లఁ బోవును నిజము
జోగియై నిలుచును జూవె యీజగతి.

వాల్మీకి:—ఇది మంగళకరమైన సమయమ్ము; మంగళములు పాడుచుఁ బురంబుఁజేరి దార పుత్రులఁగూడి సుఖమున నశ్వమేధ యాగం బొనర్పుము.

శ్రీరా:—మునివరా! సదాకాలంబు తమ దివ్యాశీర్వాదముఁ గోరుచుఁ బురికిఁ బోయివచ్చె.

సీ. దారను జేర్చినట్టి ధన్యునిఁజేసిన యతివర్య నా నమస్కృతులు మీకు,
సీత:—కన్నబిడ్డలఁ బెంచి నన్నురక్షించిన సంయమీంద్రమ నమస్కారములివె,
కుశ:—పెంచి విద్యలు నేర్పి పెద్దఁగావించిన వాచంయమీశ్వరా వందనములు,
లవ:—శస్త్రాస్త్ర విద్యలు సకలంబు నేర్పిన శమివరా మీకు సాష్టాంగనతులు.

లక్ష్మణ:—గీ. అసురు లాడుచుఁబడిన మా కసురునించి
శత్రుఘ్న:—ప్రాణదానము సేసిన ప్రణవ ధనికి
మించు వేడుక మేము నమింతు మెలమి
వాల్మీ:— అఖిల సౌభాగ్యమస్తు మీకందఱకును.

(అనుబంధము 37.)

సంపూర్ణము.

# (Appendix)—అనుబంధము.

అనుబంధము 1.

మాండురాగము—ఆదితాళము.

సూత్ర. శ్రీదేవా మహాదేవా భావమ్మననిను సదాసంస్మరింతూ ॥ ప ॥

మునుని నిన్ను మనముననందు దినదినమునేసదా
నయభయముల వినుతులజేతూ కనునను కరుణా ॥ అ ॥ శ్రీ ॥

కాలకాలముల నిన్ను కలుషహారా కృపబ్రోవా
వేడెదము నిరతమ్ము కనుము
దురితహారా ధరణిధరా భావమ్మననిను ॥ శ్రీ ॥ ౧ ॥

అనుబంధము 2.

రాగము—తాళము.

సటి. భాసురములు మధు వాసరములుగన నాసుమబాణుని యామెతదినములు ॥ప॥
కొమ్మలచెలిమిని కోమలపల్లవ మాటపురచనల్ గోపనములు ౧ ॥
పికనాదములుమహా ప్రియపంచమదన పీనామానసు గానామృతములు ౨ ॥
శుకపికశారికా సుఖమృదుపదములు సుమసౌరభిరామమై శోభిల్లుదినములు 3 ॥
స్ఫురదరుణాంశుక శోభితశాఖలు స్మరతరుదోహద స్మారకసుమములు ౪ ॥

అనుబంధము 3.

రాగము—తాళము.

మంథర. వదలనే సాహసము ఎంతటికైన ॥ పల్లవి ॥

వదిలమునామన ముదర నెవ్వనికైన ॥ అనుప ॥

దారను బెదరబాపి తారుచుగవిన కాంతారమునుండ జేరించెదనుకడి
కన్నకష్టములిడి కాకాకు మెసవించి కాంతావియోగము గలిగింతుస్వైరికి౧॥



అనుబంధము 4.

కేదారరాగము—రూపకతాళము.

అష్టాదిక్పాలురు. శ్రీకమలకాంత గోకుల విఖ్యాత సుస్వాంత
సురముని గణనుత విభువనికాంత నితాంత
ప్రణుత సుజన సురవర తరు ॥ శ్రీ ॥ ౧ ॥

సుందర మోహినివేషా నందా నందిత భాషా
ఘనసంతోషా సకలగుణ తమోహరణ
నిఖిలజగత్త్రాణ శరణు సుఖమునిడుము
కమలవదన శుభములిమ్ము గొలుతునిన్ను ॥ శ్రీ ॥ ౨ ॥

అనుబంధము 5.

మాండురాగము—రూపకతాళము.

రాము. ముదమునను హృదయమునా సదయతనూ గనుడీ
మదిమోదము గుదురగను సుదినమిది గనుడీ ॥ ౧ ॥

మునికులము వనమునను ఘనతగను కనుడీ
మనసారగ వినయముగా వినుతులిడి మనుడీ ॥ ము ॥ ౨ ॥

అనుబంధము 6.

హిందూస్తాని తోడిరాగము—ఆదితాళము.

రాము. వనవిభవము గన మనమున ఘనమయె ముదమును గనురమణి ॥ పల్లవి ॥
సీత. ఘనపరిమళమును మనమున ముదమును గననయె గనురమణ ॥ ప ॥

రాము. సురసాలముల తరుణిచాలా ఘనసాలములు గనుమదె
సీత. సరసారముల అరయవేలా ఘనసారముల గనుమదె

రాము. వినోదము గనగనూ మనమ్మునా కనన్నయె,
సీత. మనోహరా మనోహరా మయెనిది మనామునా

రాము. భావము భావజు సేవను గోరెనుగా
సీత. భావజ యావన సేవన సాగతిగా

రాము. వనజా నయనా కనుమా వనమూ కనులా

సీత. వనజాత శరా తనివారదయా గనుమా

రాము. మృదులవాణీ నీవు సదయరీతి నాపై

సీత. మదన నీవు నాపై సదయుడవు కావె

రాము. సారసాక్షీ సరసనిల్వుమా సారసాంబకుని కేళిఁ గని

సీత. నీరజాక్ష నెలతనేలుమా నీదు రాణి గనుననుఁ గని

రాము. గానా నిపుణా వనవిహారమునని పలనీతివిగా

సీత. మానా వనసీ మనమున ముదమును గనుమా ఘనతా

రాము. వనము గనగ మనము ముదముబూనెను మానిని కానవె
కన్నులారా ప్రియా ననుదయా ॥ వన ॥

అనుబంధము 7.

బేహాగురాగము—ఆదితాళము.

రాము. పటులతికా పాళిమీర నిటు రావే జానకీ నీవిటు రావే జానకీ ॥ ప ॥

సీత. అటుగనుమీ యంబుజాళి యలరారె రాఘవా హా అలరారె రాఘవా ॥అ॥
చల్లనీ గాలి జెలగునీ కానదిరుగనీ
ప్రియా నీవటుగనుమా రాఘవా ॥ పటు ॥ ౧ ॥

అనుబంధము 8.

ఝంఝూటిరాగము—రూపకతాళము.

రాము. జలజాప్తునికంటె జాతెనీరధిఁ గలువలవైరిని ॥ జల ॥

సీత. కలతబారె గనుల కాంతి కరము చింత బూనుచు ॥ జల ॥

రాము. వానియదిని పసువులూ వెసఁజనాదోసఁగులా బడుచునూ
దోస కారి వానిమీఱ వేసరిల్లి వేగమె ॥ జల ॥ ౧

సీత. నాసరినహో వసుధనూ అనుచునూ అసదృశా ముదమును
బూనుచున్న వాఁడు వేగ హీనురీతి నంవఁడే ॥ జల ॥ ౨ ॥



రాము. కర్మసాక్షినిఁ నిర్మలాంగునిఁ ధర్మమేసతి
హీనుఁబోలె మాటలాడ కానవేల మానిని ॥ జల ॥ 3 ॥

సీత. వారిజాతము గోంకోని జేంగేరుచు
పోవువాని భావమందు నేనయేల మానుము ॥ జల ॥ 3 ॥

రాము. కాలగతి నిలుపగవశమె జలధిశయనునికైనా
వలదిటు పలుకులుపలుకా జలనయనవలదు
చలము ఏల జలజకాంతు వలదు నిందనేయగ ॥ జల ॥ ౪ ॥

సీత. కోరిసతి సరసకు సరుగా సరసముగొనక జరుగుటా
వరువమెగనుమరమణా మురిపెములను నెఱపికరుణ
తరినిమీఱి వెలిచిపోవ న్యాయమె ॥ జలజా ॥ ౪ ॥

అనుబంధము 9.

బేహాగురాగము—రూపకతాళము.

రాము. సీతాసతి నిద్రగొనె నేమొహాయిగా
శయనమందు నయనాంబుజ యుగము మూసెను ॥ సీ ॥

వనజాక్షి అలసి సొలసి గనెనిదుర యోగలీని
మనసార మోముగనిన ఘనముదము కలయుగాదె ॥ సీ ॥

వారిజలోచననూ గననాయె గాఢనిద్ర
ఇందువదనముదమందిన చాలునాపనూ ॥ సీ ॥ ౨ ॥

అనుబంధము 10.

మాండ్ రాగము—ఛాప్ తాళము.

రాము. నాదుదైవమూ ఏమాయెనూ, ఏరీతి నిలతూ ఏమాయెనో ఏమాయెనో ॥ నా ॥
జానకి యింత చెడుగాయె యేమి సేతు నేనికఁ ఇటూల ॥ యే ॥ ౧ ॥
ఇంతటిచింతా జలధినీ ముగ్నుడైతి నక్కటా ఇటూల ॥ యే ॥ ౨ ॥

## అనుబంధము 11.

### శంకరాభరణరాగము—రూపకతాళము.

లక్ష్మణ. నను నిచటికి బిలువబంపిన పనియదేమొ సన్నుతాంగ ॥ న ॥
అర్ధరాత్రా సమయము నెందున నను నిచటికి
పిలుపించిన కారణమేమొ తెలుపకోరెద
క్రూర చిత్తులెవరైన గలరె
ఆజ్ఞయిడిన యట్టివారి ద్రుంచివైతు నీక్షణమున ॥ నను ॥ ౧ ॥

## అనుబంధము 12.

### హిందూస్తానిరాగము—ఆదితాళము.

రాము. విధాత వ్రాత మార్చనేర ॥ ప ॥
మనము కలతజిక్కె వనిత యిటులదక్కె
కనగలేను మోము మనగలేను భువిని ॥ విధా ॥ ౧ ॥
చనెద నెచటికైనా కనెద కొంచెమయినా
తనివి యచటనాదు దైవమింత యేమొ ॥ ౨ ॥

## అనుబంధము 13.

### యమున్ కల్యాణిరాగము—ఏకతాళము.

సీత. అతిశోకమాయె ఆయతమాయె
ధృతిలేదాయె మతిపాడయె ॥ అతి ॥ పల్లవి ॥
నక్కలుమూసె దిక్కులుమూసె
అక్కటఘోరా విపినములో అలసితినీ బడలితినీ ॥ అతి ॥ ౧ ॥

## అనుబంధము 14.

### సురటిరాగము—రూపకతాళము.

సీత. ఎంత కష్టమాయెను నాకెంతో కష్టమాయెను ॥ పల్లవి ॥
అవనిజగ భువినిబుట్టి ధవుని నెడబాసితి.
జనుల నిందలు నిజముగాను
ఘనుడు నమ్మెను హీనత ॥ ఎంత ॥ ౧ ॥



## అనుబంధము 15.

### హంసధ్వనిరాగము—ఆదితాళము.

సీత. రా దశరథా రామ వైరి భీమా
రా రాక్షసా - కులవిరామ రామ ॥ రా ॥ పల్లవి ॥
నీదాన నన్ను కనులగానక
ఆధారహీన జేయ నేలరామ ॥ రా ॥ ౧ ॥
నన్నుగొన్నవేళ నమ్మకమ్ముగాను
నిన్ను వదలనని ఆడాగలేదా
అనలు ప్రోల నీవు ఆదిదేవమున్న
ఆలించిరావా శ్రీనివాస బ్రోవా ॥ రా ॥ ౨ ॥

(60-వ పుటలో వాల్మీకి! శిష్యులారా:—రాముని పరాక్రమ విభవమును)
(మీరెల్ల కాలములందు వల్లించుచుండుడి. అను మాటైనదే ఈపాటపాడనగు.)

### భీమపలాస్ రాగము—ఆదితాళము.

మునిబాలురల. పాహి శ్రీరామ శ్యామల కోమల ధామ రామ ॥ పా ॥
కేలీన వాలీన శృంగార కాలీన భూజాత శాలీన
తాపిధాయి వైరివరా పాయి బృందారక బృంద
కానందదాయి శ్రీవిధాయి ॥ పాహి ॥ పల్లవి ॥
మాంపాహి ధీరా ధరకరాక్ష సాతతాయి
మారశత కారక మావిలాస
ఇంద్రోప భోగ విధి విధాత
అనంగతాత శుభంగజాత అభంగపూత
సమరదారుణ భూతికారణ పాపహారణ పాహి ॥ పాహి ॥ ౧ ॥

## అనుబంధము 16.

### హిందూస్తాని తోడిరాగము—ఆదితాళము.

సీత. మానస మేలాకా భీతిలెను ॥ మా ॥
మానస మేలాకా మానసమేలాకా
మానస మేలాకా భీతిలెనూ ॥ మా ॥ ప ॥

మాయామాయావణి రీతిగ దోచె
శ్రీరఘురామా కాపాడు ॥ మా ॥ ౧ ॥

కానను దారి కానను నేను
కావుమునన్ను శ్రీరామా ॥ మా ॥ ౨ ॥

అనుబంధము 17.

## హిందూస్తాని తోడిరాగము—ఆదితాళము.

రాము. నేనవనిందా గుణినైతి హీనుడనైతి మునీంద్రా ॥ నే ॥

నతినీ వదలీ గతిచెడి ఖ్యాతినీ.
వితినిల్చితిని యతివర నేను అతిశయమైన
వెతలందితిని వినూగతి గనుమా ॥ నే ॥ ౧ ॥

అనుబంధము 18.

## భీమపలాస్‌రాగము—ఝుంపెతాళము.

రాము. ప్రేమభావాదరణ సుమకలా కోమలా ॥ ప్రే ॥ ప ॥
శతమృదుచరణా నీతిపూరామలా ॥ ప్రేమ ॥ అ ॥

హతమోహ విధిమంద మాయాయె శ్రీబృంద
కీర్తిహారసుమంద ఘనసతీ మాకులా ॥ ప్రేమ ॥

ఘనభీమ వనసీమ మాయుండు నారాము
యాగమే విధిభాను విడికటా నేయగా ॥ ప్రేమ ॥

అనుబంధము 19.

## మధ్యమావతిరాగము—రూపకతాళము.

శత్రుఘ్న. చనెదనన్న పనివినియెద రామా రఘురాము నమ్ముము ॥ పల్లవి ॥
యనుని నిన్ను నెదనమ్మి పనివినియెగ నమ్ముమా ॥ అ ॥
చనియెద హాయమును వెనుదవిలీ కనియెద వైరులను పోరునా
వరవీరా ధీరానుత సురపోషణ శ్రీరాఘువ ॥ చనె ॥ ౧ ॥



అనుబంధము 20.

## రాగము—తాళము.

శత్రుఘ్న. నయరీతినీ విరీ వినయమ్మునా జేరి ॥ నయ ॥ వల్లవి ॥

మనసారగ మాటలాడి మమతను జూపెదమది
అనినేయ వీరినిగని మాటలాడ వనిబాలురబలురివె ॥ న ॥ ౧ ॥

తమశక్తియు నెదురుశక్తి మనమునందు గానకయుటు
తమకించుచు తామనులై తప్పదారి గనువారలు అబలురివె ॥ నయ ॥ ౨ ॥

అనుబంధము 21.

## జిల్లారాగము—ఏకతాళము.

లవ. ధాత్రీశా జాతికులమేలా రిపులకూ ॥ ధాత్రీ ॥
జాతికులమేలా రిపులకూ ॥ ధాత్రీ ॥ పల్లవి ॥

ఆవరామున బాణమువేయా పాడియె నాచెలియా ॥ ధా ॥ ౧ ॥

కులము జాతి క్రూరశరాళి బోలునె నాచెలియా ॥ ధా ॥ ౨ ॥

అనుబాధము 22.

## ఖాగేశ్రీరాగము—రూపకతాళము.

బాలుడయ్యో యకటరాక నిల్చెనకటా
యేమినేయ బోవదాయె ॥ బాలు ॥ పల్లవి ॥

మనమదేమొ వనటజిక్కె తనను వథము నేను
వనతలముల జిక్కెనేమొ మదినిదిగులు ఆయె ॥ బాలు ॥ ౧ ॥

అనుబంధము 28.

## యదుకుల కాంభోజరాగము—చాప్ తాళము.

సీత. అయోధ్యలవ నీవెంత మయ్యాడితివా ఏలా
కయ్యామందున జిక్క ॥ అయోధ్య ॥ వ ॥

వైరివారము నిన్ను క్రూరా శరము వేయా
తారితాఱుచు నేటుల ధరణిని బడితివా ॥ అయ్యో ॥ ౧ ॥

తల్లిరమ్మని నన్ను నుల్లమునను నెన్ని
తల్లడిల్లుచు నేటుల ధరణిని బడితివా ॥ అయ్యో ॥ ౨ ॥

## అనుబంధము 24.

### కాపీరాగము—ఆదితాళము.

కుశ. ఇదియేమి మాతా సీతా ॥ ఇది ॥ పల్లవి ॥

ఈరీతి వెత కుందగనేలా ॥ ఇది ॥ అను ॥

ఇంతటివంతలు ఏలాగో నీకూ
పుడమిని బడ నేలా ॥ ఇది ॥ ౧ ॥

ఎంతటి కార్యము నైనను దీర్తు
తెలుపావె మహీజాతా ॥ ఇది ॥ ౨ ॥

## అనుబంధము 25.

### రాగము—ఏకతాళము.

లవకుశ. కుశ. లవకుమార బవరము నేయుదు
భువనము గెలుచుచు మించుదు ॥ లవ ॥ పల్లవి ॥

లవ. కుశకుమార మదురుగ నిల్వుమా
నిశిత బాణములను గెల్వుమా ॥ కుశ ॥ పల్లవి ॥

కుశ. శూరవరునిగా దూరామునననూ
వీరావరుడూ చేరుమన్నులా
శరము లేని అనినిగూల్తు
భువి గెలుచుచు మించుదు
భువనము గెలుచుచు మించుదు ॥ లవ ॥ ౧ ॥



లవ. క్రూరశరములా ధీరాతగని
వైరివరునీ చెండాడెదనూ
ధరణిలో నాయశమునింతూ
శరమ్ము బరపీ ఛేదింతూ
శరములాను బరపీ ఛేదింతూ ॥ కుశ ॥ ౧ ॥

## అనుబంధము 26.

### కాపీరాగము — చాపు తాళము.

రాము. అహహా చిత్త సంతాపముగా నైననూ
మహావేగ శోకాగ్నిలో ముగ్గెనూ ॥ ప ॥

మహానెందు కానను సత్యావ్యుడూ
మహాత్ముండు శత్రుఘ్నుండా కోటా కడూ ॥ ౧ ॥

అహార్యోరు గంభీరుడు ధీరుడూ
మహా… వీడిపోయెనె సీతాఘుడూ ॥ అహహ ॥ ౨ ॥

## అనుబంధము 27.

### జిల్లా రాగము—ఏకతాళము.

లక్ష్మణ. బాలూరు మీకిటు బవరము తగునె చాలు ॥ బా ॥

కుశ లవ. బాలుర మనవలదూ ధీరా ॥

లక్ష్మణ. శ్రీరాముల హాయమిది కనుమా

కుశ లవ. ఏదైనను వదలము హాయము

లక్ష్మణ. చలమిదీ ఖలమగు నెటులా

కుశ లవ. ధీరులా పంతమువదలా

లక్ష్మణ. వదలాము వలదిటులా

కుశ లవ. కదలారా కదనమునా

లక్ష్మణ. న్యాయమా మానా

కుశ లవ. పోరా ధీరా

లక్ష్మణ. బాలారు మీకిటు బవరము తగదు చాలు ॥ బా ॥

అనుబంధము 28.

హిందూస్తాని తోడిరాగము—రూపకతాళము.

లక్ష్మణ. దీనుడైతినీ నేనూ దీనుడైతినీ
ధీరతా వదాలె ॥ దీను ॥ పల్లవి ॥

పోల్గాను రామా నిరంతరము
నామదిగా స్మరింతునిన్ను ॥ దీను ॥ ౧ ॥

బాలుర శరము శరీరమునా
బాధలునిడెను నాకు ॥ దీ ॥ ౨ ॥

అనుబంధము 29.

మాండ్ రాగము—ఏకతాళము.

రామ. మనమ్మునా ఘనమ్మయె కనికరమ్మెమొ
కనఁగనా మనామదేల మమతను బూనె ॥ మ ॥
విన్నాణపు బాలురను కన్నారఁగను గాంచ
కృపారసము పారమై విపర్య మిగతీగనా
ఇద్వీరులు ఎవ్వారొకొ క్రొవ్వారగననుగా గనగా
పరాక్రమ బలిష్ఠులై దురమ్మున నెదిరిరి ॥ అహ ॥ ౧ ॥

అనుబంధము 30.

శహానరాగము—రూపకతాళము.

రామ. మానసామున మానని వెతనూ
బూనితివిధి గతిగననూ ॥ పల్లవి ॥



బాలుర కనుగొన భావమందున
బాధను జెందితినీ బాలురుగనీ ॥ ౧ ॥

కాంతనూ ప్రియగా కాననామున నూ
ద్రోసితివిధి గతికననూ ॥ ౨ ॥

కానను సుఖమును మానసమునను గతికననూ
దీనత చెందితిని బాలురా గనీ ॥ 3 ॥

అనుబంధము 31.

బిలహరిరాగము—రూపకతాళము.

రామ. నేరానే పోరనీతరి బాలురతో మేలని ॥ నేరా ॥
నేరని బాలుర కూడుచు ధీరతపోరగ బోలునె ॥ నే ॥

కుశ లవ. ధీరా యీదారిధర్మమె శూరాలికి చెల్లునె ॥ ధీరా ॥
పోరు నధీరత గాంచుట శూరుల ధర్మమునమ్ముము ॥ ధీ ॥

రామ. మీ రబలురూ మిగులగా వలదు పోరా

కుశ లవ. నా జనకునీ మతము నే ననుసరింతూ

రామ. మానీ పరబలము వారికినిగలుగ వా రసురవరుల నొర్చిరీ

కుశ లవ. భూరియతివరు దయదేరి కళలను గనినాము తిరముగ నిటునిల్వుము

రామ. నీజనకునకు శరవిభవమ్ముగలిగె గాదా

కుశ లవ. మానులవు చనూన తపము బూని కుశలుండాయె

రామ. బాణము వేయగ జాలను బాలురు మీపై చలమున ॥ నే ॥

అనుబంధము 32.

మాండ్ రాగము—ఆదితాళము.

కుశ లవ. భూరిమోదాము గలిగె నేడుగదా
పోరి వీరులతోడ గెల్వగను ॥ భూరి ॥ ౧ ॥

సకలఫలన సారా కాంచెవువారే
జయమును బడసితి మందలచే ॥ భూరి ॥ – ॥

### అనుబంధము 33.

### మాండ్ రాగము—రూపక తాళము.

సీత. రాకనిల్చిరి అయ్యో రాకనిల్చిరి
నాకుమారు లేలనికను రాకనిల్చిరీ ॥ అయ్యో ॥ పల్లవి ॥

బాలు రదవి పాలు మారిరో కాలగతి జిక్కిరో
చీకదక్కిరో లేక దారితప్పిరో ॥ అయ్యో ॥ ౧ ॥

### అనుబంధము 34.

### ఆభేరి రాగము—ఆదితాళము.

కుశ లవ. ఎనలేని చలమూని నేనానుగలచీ
మనసార గాచేము పోరితిమనిన ॥ ఏ ॥

జనయిత్రీ వినవమ్మా జననాథు వెల్లా
తెనుదీయక నూ పోరి యీవేళగూరి పడిపోయిరి వేగా ॥ ఏ ॥ ౧ ॥

వరవీర వైరులను గురుశక్తి పడవైచి
ధరగూల్చి త్వరితాముగ ఘోరావాంచకేళీ నెరిదాల్చి
బాగరార్చి నరనాథు గెల్చి యురుకీర్తిని నార్జించి
జనవచ్చి నిను గంటిమితల్లీ ॥ ఏన ॥ ౨ ॥

### అనుబంధము 35.

### సావేరి రాగము—చాపు తాళము.

సీత. వనితల భాగ్యము వసుధను భర్తయై వాసిల్లగను నెంచను ॥ వ ॥

శ్రీరామునననువీడి పోరాడు మదివీడి
యీరీతి మహిబడి పోరుసు మానితె ॥ వని ॥ ౧ ॥



నీరార నను నేను నాధార రహితనై
పోరాని గానను కోదైవ మాయల ॥ వని ॥ ౨ ॥

విభుని యీటు నేను నీయం బ్రదుకుదు
స్వామి గతిగన నేమన భూమినీ ॥ వని ॥ ౩ ॥

### అనుబంధము 36.

### కాపీ రాగము—త్రిశ్రగతి తాళము.

వాల్మీకి. జానకీశ యీశ పావనాశ రామ కావుమా
నిగమాంత విదిత నీరజ నేత్ర బ్రోవుమా ॥ జ ॥

సురవార [illegible] సూరితోషణ సుగుణ భూషణ
పావనా [illegible] జనావనా ॥ జ ॥

అగస్త్య పూజ్యమూర్తి గాంచి ఆనంద మందితి
[illegible] నీపదంబు నమ్మితిగా
శ్రీరామ [illegible] రాము శ్రీనివాస రాము ॥

### అనుబంధము 37.

### ఇంగ్లీషు నోటు రాగము—త్రిశ్రగతి తాళము.

శ్రీరామ [illegible] కరుణా భరణా
[illegible] శోకహరణ ॥ శ్రీ ॥

[illegible] దానమునుకా – నీ
[illegible] కటముగనుకా
[illegible] చ్ఛితికరణుకా – నాకీ
[illegible] నూవితతా వినబాతా వెదను [illegible]



